# సాయం సంధ్యలు



రచన.

గొగోల్



రత వాణిజ్య (ప్రయివేట్) లిమిటెడ్

న్యూఢిల్లీ

1

# సాయం సంధ్యలు



అనువాదం:
శ్రీనివాస చక్రవర్తి

పాటలు:
రాంభట్ల కృష్ణమూర్తి



# పీఠిక

"ఏమిటీవిడ్డూరం! ఢికాంకా గ్రామసమీపంలో సాయం సంధ్యలు? ఇదేం పేరు? ఎటువంటి సాయంసంధ్యలు? అందులోనూ తేనెటీగలను పెంచే ఈ మానవుడు ప్రపంచం నెత్తిమీద బలవంతాన రుద్దిన కథలు! పాపం శమించుగాక! కలాలకోసం బాతులను వేటాడడం చాలకనా? చింపిరిగుడ్డలు కాగితంగా మార్చడం చాలకనా? వివిధవర్గాల జనం వేళ్ళకు సిరామరకలు చేసుకోవడం చాలకనా? వారు తొక్కిన త్రోవే తొక్కాలని ఈ తేనెకాపరికి తిక్కపుట్టాలా? ఈ రోజుల్లో చెత్త ఎంతో అచ్చయి వస్తోంది. చిత్తుకాగితాలకింద ఎంత వాడినా తరగడంలేదు।"

ఇలాంటి సందేహాలు వస్తాయని నెలరోజులకితమే నేను ఊహించాను. ఏదో మామూలపడిఉండే ఈ పల్లెటూరి

మొద్దు ఈ విశాలప్రపంచంలో తలెత్తుకుతిరగడం ఏ మహా ప్రభు మందిరంలోనే అడుగుపెట్టి స్టుంటుంది. నలుగురూ చుట్టుముట్టి తెలివితక్కువ దద్దమ్మక్రింద కట్టేస్తారు. అలా కట్టేసేది పెద్దనౌకర్లయితే ఏదోలే అని దులిపేసుకోవచ్చు గాని వెనకదొడ్లో పడివుంటే ప్రతిచవట వెధవాయీ ఏడిపించుకుతింటాడు. నేల తన్నుతూ "యెక్కడికి వెళ్ళుతున్నావ్! నీకేంకావాలి? ఊఁ-పోపో!" అని బిగ్గరగా అరుస్తూ తరిమికొడతాడు. అంతేకాదు- ఉట్టిమాటలతో ప్రయోజనమేమిటి? నేను మిర్గోరాడ్ జిల్లాకోర్టు సలహాదారు కంటికి, ఫాదరీగారి కంటికి కనిపించి అయిదేళ్ళయింది. ఏడాదికి రెండుసార్లు అక్కడికి వెళ్ళనన్నా వెళ్ళొచ్చుగాని ఈ ఘరానా మనుషుల మధ్యకు మాత్రం చస్తే వెళ్ళకూడదు. కాదుకూడదు. వెళతామంటారా, సరే వెళ్ళండి, వెళ్ళి అనుభవించండి!

ఇక మా ఇంటిదగ్గర, ప్రియమయిన పాఠకులారా,- మరేం అనుకోకండేం? (ఏదో పాత స్నేహితుడితోనో ప్రాణ స్నేహితుడితోనో మాటాడుతున్నట్టు మీతో చనువుగా మాటాడుతున్నందుకు కోపగించుకోకండి!) - ఇంటిదగ్గిర మా పల్లెలో పొలంపని పూర్తికాగానే స్టోవ్ మీదికిఎక్కి పడుకుని శీతాకాలమంతా గడపడం మాబోటి రైతులకు అలవాటు. మేము, తేనె కాపర్లం, మా తేనెటీగలను నేలమాళిగంలో పడేసి ఉంచుతాం. ఆకాశంలో కొంగలు, చెట్లకు బేరి పళ్ళు కానరాని రుతువులో సాయంకాలం పడీపడగానే పల్లెచివర

ఎక్కడో అక్కడ చిన్నచిన్న నెగళ్ళు కనిపిస్తాయి. దూరా న్నుంచే నవ్వులు, పాటలు, బాలలేకావాయిద్యం, అప్పుడప్పుడూ ఫిడేలు వాయిద్యం, కేరింతలు, అల్లరి వినిపిస్తుంది. అవి మా సాయం వేడుకలు! అచ్చంగా కాకపోయినా అవే మాకు నాట్యప్రదర్శనాలు! నాట్యప్రదర్శనానికి వెళితే ఆవలింతలు వస్తాయి. అటూ ఇటూ తచ్చాడడంతో సరిపోతుంది. ఇక మా వేడుకలో? మా పల్లెలోని ఆడపిల్లలు పంబెకర్రలు, ఏకు దువ్వెనలు తీసుకుని ఏదో ఒక గుడిసెలో చేరతారు. నాట్యం చేయడానికేం కాదు. పనిపాటలు చేసుకోడానికి, పంబెకర్రలు ఝుమ్మంటూయ్. సంగీతంఎడతెగకుండా ప్రవహిస్తుంది. కాని ఒక్కరూ తలెత్తిచూడరు. ఫిడేలువాడిని వెంటేసుకుని కుర్రకారు గుడిసెలోకి చొరబడగానే సందడో సందడి! వేడుకలు ప్రారంభమవుతాయి! నాట్యం మొదలు పెడతారు. ఒకటేమిటి చెప్పరాని కొంటెచేష్టలు చేస్తారు.

అంతా ఒకచోట గుమిగూడి పొడుపుకథలు వేసుకోవడమో, బాతాఖానీ కొట్టడమో చేస్తూంటే బలేభేషుగ్గా ఉంటుంది. ఒహోహో! ఏంచిత్రమయిన కథలు చెప్పుకుంటారనుకున్నారు! పూర్వకాలపు గాథలు తవ్వి తలకెత్తుతారు! ఒళ్ళు ఝల్లుమనే విషయాలు వర్ణిస్తారు! కాని తేనెకాపరి గింగర్ పాంకో కుటీరంలో చెప్పే కథలవంటి కథలు ఎక్కడా మీరు వినిఉండరు. నన్ను గింగర్ అని మాగ్రామస్తులు ఎందుకు పిలుస్తారో నిజంగా నాకూ తెలీదు. నాజుట్టు ఇప్పుడు నెరిసిపోయిందనుకోండి ఒకసారిగనక మారుపేరు పెడితే బతికి ఉన్నంతవరకు జీడిలాగా వదలదు. సాయంకాలంపూట ఈ తేనె

కాపరి కుటీరంలో మంచిమంచి వాళ్ళు చేరి విందుకు కూర్చుంటారు. అప్పుడు వినాలి! ఇక వచ్చే అతిథులు అలగా జనమేమీ కాదు. రైతులు, తేనెకాపర్లకంటె ఎక్కువ హోదాగల వారికికూడా వీరిరాక గౌరవకారణం, ఉదాహరణకు–డికాంకో. చర్చిభాండారి *ఫోమాగ్రిగోర్యెవిచ్ ని బాగా ఎరుగున్నారా? ఓ – బుర్రవున్న మనిషి! ఎటువంటి కథలు చెపుతాడనుకున్నారు! బలే! ఆయన చెప్పిన కథలు రెండు ఈపుస్తకంలో చేర్చాను. పల్లెటూరి చర్చి భాండార్లు మామూలుగా తొడిగే చేనేతకోట్లు ఆయనతొడగడు. పనిరోజుల్లో అయినా సరే, ఆయనను చూడడానికి వెళితే ఉడికిన ఆలూగడ్డరంగు సన్నని-చొక్కా తొడుక్కుని వచ్చి ఆదరిస్తాడు. ఆ చొక్కా గుడ్డ గజం ఆరు రూబుళ్ళు పెట్టి పోల్టావాలో కొన్నాడు. ఇక ఆయన ఎత్తుబూట్ల విషయం: తారు వాసన కొడతాయని మా పల్లెలో ఒక్కడూ అన్నపాపాన పోలేదు. రైతులు పులుసులో వేసుకునే మ్లాంచి కొవ్వు వాటికి పూస్తాడని అందరికీ తెలిసిందే. అందరు భాండార్లలాగా చొక్కా అంచుతో ముక్కు తుడుచుకోడు. చక్కగా మడతలుపెట్టిన ఎర్రంచుల తెల్లటి జేబురుమాలాతీసి, దానితో పని అయిపోగానే, అలవాటుప్రకారం పన్నెండు మడతలూ పెట్టి తిరిగి జేబులో పెట్టుకుంటాడు.

ఇంకోవ్యక్తి : యువకుడు. చక్కనివాడు. చూడడానికి ఏ న్యాయాధిపతికి సలహాదారు లాగానో భూఖామందు లాగానో ఉంటాడు. కథ చెప్పేటప్పుడు చేతివేలు పైకెత్తి

---

* భాండారీ, చర్చిలలో, మఠాలలో పాత్రసామగ్రిని పదిలపరిచే అధికారి.

దాని కొనమీద చూపు నిలుపుతాడు. పుస్తకాల్లో కనిపించే చమత్కారాలు, సొగసులు అన్నీ స్వంతంలా ఉపయోగించుకుంటాడు. వినగా వినగా అయోమయ స్థితిలో పడిపోతాం. ఎంత కొట్టుకున్నా తలాతోకా తెలీదు. ఆ మాటలన్నీ ఎక్కడ పట్టాడో? ఈ ప్రశ్నకి సమాధానంగా ఫోమా గ్రిగొర్యెవిచ్ చక్కని కథ చెప్పాడు: ఒక పిల్లవాడు గురువు గారిదగ్గర లాటిన్ భాష చదువుకొని ఇంటికి తిరిగివచ్చాడు. లాటిన్ భాష చదివీచదివీ మాతృభాష మరిచేపోయాడు. ప్రతిమాటకూ లాటిన్ విభక్తులు చేర్చి మాట్లాడటం అలవాటయిపోయింది. ఇలా ఉండగా ఒకరోజున పొలంలో పండ్లకోల కనిపించింది. కనిపించేసరికి తండ్రిని, 'దీనిపేరేవిటిం నాన్నా?' అని అడిగాడు. కాని చూడకుండా ఆ కోలపళ్ళ మీద అడుగువేసాడు. తండ్రి జవాబు చెప్పేలోపున కోలపిడి పైకి లేచి పిల్లవాడి మొహానికి టపీమని కొట్టుకుంది. 'వెధవ పండ్లకోల!" అన్నాడు, నుదురుమీద కొట్టుకునేసరికి అర్ధ గజంమేర ముందుకు దూకుతూ. 'దీన్ని తగలెయ్యా!' అని తిట్టాడు ఏమయితేనేం పేరు జ్ఞాపకం వచ్చింది."

అయితే మన కథకుడి బుర్ర పెద్దదేమో ఈ కథ నచ్చలేదు. మాటాడకుండా లేచి, గదిమధ్య పంగజాపుకుని నిలబడి, తల కొద్దిగా ముందుకు పోనిచ్చి, బటానీ పచ్చరంగు కోటు వెనకజేబులో చేయిపెట్టి, గుండ్రటి లక్కపొడుం డబ్బీ పైకితీసి, మూతమీద చెక్కిన ముస్లిం సేనాని బొమ్మమీద వేళ్ళతో టకటకా కొట్టి కొయ్యబూడిద లవంగఆకుల పొడి కలిపిన నశ్యం చిటికెడు తీసి, మోచేయి ముక్కుదగ్గరికి

పోనిచ్చి, బుర్రుమని చిటికెమా పీల్చేసాడు. ఇంత కష్టపడ్డా ఒక్క మాటకూడా మాటాడలేదు. ఇంకో జేబులోనుంచి ఊదా గళ్ళ జేబురుమాలు పైకి తీస్తూ ఏదో గొణిగాడు. బహుశా పందికి పన్నీ రెందుకు అని అయివుంటుంది 'పోట్లాట అయిపోతుంది' అనుకున్నాను, ఫోమా గ్రిగొర్యెవిచ్ చేతివేళ్లు అతనిముక్కు పిండేయడానికి సిద్ధమవడం చూసి. కాని అదృష్టం కొద్దీ సరిగ్గా ఆ సమయానికి నా భార్య వేడివేడి రొట్టె ముక్కలు, వెన్న తెచ్చి బల్లమీద పెట్టింది. ఇంకేవుంది? వాటిపని పట్టించడం మొదలుపెట్టాం. ఫోమా గ్రిగొర్యెవిచ్ చేయి ఆ దారుణప్పనికి పూనుకోకుండా వేడివేడి రొట్టె ముక్కలకోసం ఎగబాకింది. వాటలో మా ఆవిడ నేర్పును అంతా మెచ్చుకోసాగారు. మామూలేగా!

ఇంకో కథకుడు : ఆయనగారికి - రాత్రిళ్ళు ఆయన మాట తలపెట్టకుండా ఉండడం మంచిది - మహాభయంకరమయిన కథలు చాలా వచ్చు. వింటూంటే ఒళ్ళు జలదరిస్తుంది. కావాలనే ఈ పుస్తకంలో ఆ కథలు చేర్చలేదు. ఆ కథలు వింటే మెత్తనివాళ్ళు జడుసుకుంటారు. ఈ తేనె కాపరిని దెయ్యాన్ని చూసినట్టే చూస్తారు. దేవుడిదయవల్ల వచ్చే ఉగాదిదాకా నేను బతికేఉంటే ఇంకో కథలసంపుటం ప్రకటిస్తాను. అందులో పూర్వం ఈ క్రైస్తవ ప్రపంచంలో తిరిగిన దెయ్యాలనుగురించీ, జరిగిన అద్భుతాలను గురించీ చెప్పి పాఠకులను జడిపిస్తాను లెండి! ఈ తేనెకాపరి తన మనమలకు మనమరాళ్ళకు స్వయంగా చెప్పిన కథలు కొన్ని మీరు అందులో చదువుతారు. జనానికి చదవడానికీ విన

డానికీ ఓపిక ఉండాలే గాని తల బద్దలుకొట్టుకో నవసరం లేకుండానే పది సంపుటాలకు సరిపడే కథలు నేనుచెప్పగలను.

అరె! ఇంతకీ అతి ముఖ్యమయిన విషయం ఒకటి చెప్పడం మరచిపోయాను. నన్ను చూడడానికి రాదలిస్తే సరాసరి డికాంకా వచ్చే రహదారి పట్టండి. మా పల్లెను సులువుగా కనుక్కొనేందుకే పుస్తకంపేరులో మా పల్లెపేరు ఇరికించాను. డికాంకానుగురించి మీరు ఎక్కువగా వినే వుంటారు. ఈ తేనెకాపరికుటీరం అక్కడివాటిల్లోకల్లా చిన్నదేంకాదు. ఇక పార్కు. మా పార్కులాంటిపార్కు మీ సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోకూడా లేదు. మీరు డికాంకా చేరుకోగానే మురికిచొక్కా తొడుక్కుని బాతుల్ని కాచే ఏగొట్టికాయనయనా 'తేనెకాపరి గింగర్ పాంకోయిల్లెక్కడ?' అని అడిగితేచాలు, 'అదిగో, అక్కడ!' అని జవాబిస్తారు' వేలితో చూపెడుతూ, రమ్మంటే కూడా వస్తారు. కాని ఇంకో విషయం ఇక్కడ చెప్పాలి. మా పల్లెలోనిరోడ్లు మీ భవంతుల ముందరిరోడ్లంతా నున్నగా ఉండవు. అందుకని చేతులు వెనకకు పెట్టుకుని దర్జా ఒలికిస్తూ నడవకండి. ఆ కిందటి సంవత్సరం ఫోమా గ్రిగొర్యెవిచ్ స్వయంగా పెట్టిబండి తోలుతూ కళ్ళజోడు పెట్టుకునికూడా బండీ గుర్రంతోసహా గోతిలో పడ్డాడు.

మీరు మా పల్లె రావాలేగాని, మాంచి ఖర్బూజా పళ్ళు రుచిచూపిస్తాం. అంత రుచిగల పళ్ళు జీవితంలో ఎన్నడూ మీరుతినిఉండరు. నామాట నమ్మండి, మా పల్లెలో దొరికేటంత మంచి తేనె మీకింకెక్కడా దొరకదు. తేనెపట్టు

ఉంది చూసారూ, దాని వాసన గదిఅంతా గుప్పుమంటుంది. ఆ వాసన ఏమిటో మీరు ఊహించలేరు. ఆ తేనెపట్టు కన్నీటి చుక్కలాగా బావిలోని స్ఫటికంరాయిలాగా స్వచ్ఛంగా ఉంటుంది. మా ముసలిది మీకు ఎటువంటి బజ్జీలు వండిపెడుతుందనుకున్నారు! ఒహోహో. ఏం కమ్మతనం, ఏం కమ్మదనం! ఇక వెన్న నాలికమీద వేసుకుంటే ఇట్టే కరిగిపోతుంది. బలే! ఆడవాళ్ళు ఎంతకయినా తగుదురు! మీరు ద్రాక్ష రసంతో మిళావుచేసిన బేరిసారాగాని, ఎండుద్రాక్ష వోడ్కాగాని, గోధుమ పాయసంగాని తాగారా? ఓ- ఏం రుచి! తాగడం మొదలుపెడితే స్వర్గం రుచిచూసినట్టుంటుంది. కిందటి సంవత్సరం - అబ్బో! ఒకటే ధోరణి - సాధ్యమైనంత తొందరగా వచ్చిచూడండి. మీకు ఎంత మంచి మంచి వస్తువులు ముట్టచెపుతాననుకున్నారు, కనిపించినవారితోనల్లా వాటినిగురించే మీరు ముచ్చటిస్తారు.

ఇట్లు
తేనెకాపరి,
గింగర్ పాంకో—





# సంత

## 1

నేగడపలేనింక
ఈగుడిసెలో బ్రతుకు
కొనిపొమ్ము కల కల
స్వనము విరిసే కడకు
పడతు లందరు కూడి
పాత పాటలు పాడి
చిరు గజ్జియల మ్రోత
విరజిమ్ము సీమలకు।

—ఒకపాత వీరగీతం

యుక్రెయిన్‌లో వేసంగిరోజులు! ఎంత మత్తుగొలిపే రోజులు? ఎంత దివ్యమయిన రోజులు! నిశ్శబ్దంతో, ఉక్కపోతతో మెరిసిపోయే మిట్టమధ్యాహ్నంవేళ ఎంత సుఖంగా, ఎంత వెచ్చగా ఉంటుంది! కళ్ళకు పండుగ గొలిపే గుమ్మటంలాగా విలువంపు తిరిగి, మాంద్యంలో స్నానమాడి, సుందరభూదేవిని ఒడిసిపట్టి, దగ్గరగా కరుచుకుని నిద్రిస్తున్నట్లుంటుంది, విశాల నీలిఆకాశం! ఆ ఆకాశంలో మచ్చకయినా మబ్బుతునక కనిపించదు. కింద, భూమ్మీద ప్రాణి చిలుక్కుమనదు. ఆకు అల్లల్లాడదు ఎక్కడో ఆకాశంలో కంపితస్వరంతో భరతపక్షి కూస్తుంది. ఆ మృదుమధురస్వరం గణగణా భూమ్మీదకి దిగజాలువారుతుంది. మధ్యమధ్య సీటి కాకి అరుపు, కోలంకిపిట్ట కిచకిచ మైదానంలో ధ్వనిస్తాయి. గోపురాలలాంటి సిందూరవృక్షాలు గమ్యంలేని బాటసారులలాగా సోమారితనంగా జిల్లాయిగా నిలబడి ఉంటాయి. కళ్ళు మిరుమిట్లు గొలిపే సూర్యరశ్మి పత్రసముదాయానికి వెలుగును ప్రసరిస్తూ తక్కినవాటిని కారుచీకటిలాంటి కీనీడలతో ముంచెత్తుతుంది. కాని గాలివీచే సమయంలో మాత్రం ఆకాసనల్లని కీనీడలకు పసిడిబొట్లు పెడుతుంది. పొద్దుతిరుగుడుపూలు ఎత్తుగా, వైభవంగా పెరిగిన పెరడులలో కీటకాలు మరకతమాణిక్య కాంతిచ్ఛటలాగా తుర్రున ఎగురుతుంటాయి. బూడిదరంగు గడ్డివాములు, పసిడిపచ్చని గడ్డిమోపులు డేరాలలాగా బారులుతీరి ఆ విశాల మైదానంలో చెల్లాచెదురుగా పడి ఉంటాయి. 'పండ్లబరువుకు వంగిన రేగి, కిస్మిసు, రామాఫలం కొమ్మలు, ఆకాశం, ఆకాశానికి ఆకుపచ్చని చత్రపు

అద్దం పట్టినట్లుండే నది-ఒహూ! యుక్రెయిన్‌లో వేసవి ఎంత వైభోగంగా, ఎంత మందకొడిగా ఉంటుందని'!

పద్ధెనిమిది వందల ... పద్ధెనిమిది వందల ... అవును, సుమారు ముప్ఫయి సంవత్సరాల కితం ఆగస్టు వెం డంలో అంత దివ్యంగా ఉన్న ఒకానొక సొరోచిన్ట్సి గ్రామానికి పది వెర్స్టుల దూరంలో ఎక్కడెక్కడి క్షేత్రాలను చీ సంతకు తొందర తొందరగా వెళుతున్న జనంతో రోడ్డు కిటకిట లాడిపోతోంది. తెల్లవారుజామునుంచీ చేపలతో ఉప్పుతో నిండిన బళ్ళు ఆ రోడ్డువెంట అంతూపొంతూలేని గొలుసులా సాగిపోతున్నాయి. గడ్డిచుట్టిన కుండల కొండలు చీకటిలో బంధించడం మూలంగా విసిగిపోయినట్లు నింపాదిగా వెళు తున్నాయి. అక్కడక్కడమాత్రం మెరిసిపోయే కూజాలు, మూకుళ్లు, బళ్ళమీది కుండల కొండలను అణిచిపెట్టే తడి కల కిందనుంచి సగర్వంగా తొంగిచూస్తూ అటువంటి విలాస వస్తువులంటే ముచ్చటపడే జనం దృష్టిని ఆకర్షిస్తున్నాయి. తోవబోయేవారిలో చాలామంది బండివెనక నడుస్తున్న కుమ్మరిమీద అసూయాదృష్టులు బరపుతున్నారు. అమూల్య మయిన ఆ సామగ్రికి ఖామందు ఆ కుమ్మరి. బండివెనకే మెల్లమెల్లగా నడుస్తూ మధ్య మధ్య ఆమ్మణ్ణ్యయు కాంతలను అవి ఏవగించుకునే గడ్డిలోకి జాగ్రతగా తోస్తున్నాడు.

అందరికీ దూరంగా, రోడ్డుకు ఒకవేపున గోనెలు, జనపనార, నారబట్టలు, ఇంటిసామాను ఎక్కుగా వేసిన బండిని లాగుతూ అలిసిపోయిన ఎడ్లజతలు నడుస్తున్నాయి. వాటి యజమాని శుభ్రమయిన చొక్కా, మాసిపోయిన పట్లాం

వెనకనడిచి వెళ్ళుతూ పొడుగాటి మీసాలనుంచి
...ం జాలువారే చెమట కాలవలను నల్లటి మొహంమీద నుంచి నింపాదిగా తుడుచుకుంటున్నాడు, పిలవని పేరంటంగా నీలురాయళ్ళకు సంసారపక్షంవాళ్ళకు సమంగా పొడిపట్టించే రాతిగుండె మంగలిపీటికీ ఇంతపొడి పట్టించాడు. నేలకొలది సంవత్సరాల తరబడి మానవజాతికి ఈ మంగలివాళ్ళు బలవంతాన పొడిఘాస్తూనే ఉన్నారు. అతనిపక్కన బండికి కట్టిన ఆడగుర్రం నెమ్మదిగానడుస్తోంది. దాని నెమ్మదిచూస్తే ఏళ్ళు పైబడ్డదానిలా ఉంది.

మనరైతు ఊరసిల్లగానే బాటసారుల్లో చాలామంది ముఖ్యంగా యువకులు నెత్తిమీద టోపీలు తీసివేసుకుని గౌరవం చూపారు. కాని ఇందుకు కారణం ఆ రైతు తెల్ల మీసాలూ కాదు, హుందా నడకా కాదు! ఈ వినయానికి కారణం తెలుసుకోవాలంటే తల కాస్త పైకెత్తితే చాలు తెలిసిపోతుంది. బండిమీద అతని కూతురు కూర్చునిఉంది. చక్కనిచుక్క, గుండ్రటి మొహం, స్వచ్ఛమయిన గోధుమ రంగు కళ్లు, నిలువంపుతిరిగి సమపాళంగా నల్లటి కనుబొమలు, పెదవులమీద చిరునవ్వు, సొగసయిన తలమీద ఎరుపు నీలి రిబ్బన్లతో అల్లిన పొడుగాటి జడలు, జడలకు అడవిపూలు. అక్కడ ప్రతీదీ ఆమెకు ఆసక్తిని రేకెత్తిస్తోంది. అంతా ఆమెకు కొత్తగా, చిత్రంగా ఉంది. చూపు ఒక వస్తువుమీద నుంచి ఇంకో వస్తువుమీదికి పరుగిడుతోంది. అవును, ఆసక్తి కలగడం సహజమే! సంతకిరావడం ఇదే మొదటిసారి. మొదటిసారిగా పద్దెనిమిదేళ్ళ పడుచు సంతకు రావడం!

సంతకు వెంటతీసుకువెళ్ళడానికి తండ్రిని ఒప్పించేందుకు ఆమె ఎంత అవస్థపడిందో దారిపోయే ఆ బాటసారులకేం తెలుసు? ఆమెను తండ్రి ఎప్పుడో సంతకు తీసుకువెళ్ళేవాడేగాని సవతి తల్లి పడనిచ్చిందిగాదు. ఆ సవతితల్లి వట్టి చప్పనాతి. ఎంతో కాలం సేవచేసినందుకు ఫలితంగా గుర్రాన్ని అమ్మకానికి తోలుకుపోతున్నట్లే ఆమె భర్తను ఇష్టంవచ్చినట్లు ఆడించ డంలో మహా తెలివయింది. అబ్బ! వట్టి గయ్యాళిగంప! కాని ఆమెకూడా సామానుమీద కూర్చుని ఉందని మరిచే పోతున్నాం. తెల్ల అడవిపిల్లని అనుకరిస్తూ కట్టిన చిన్న చిన్న ఎర్రకొసల ఆకుపచ్చని ఉన్నిజాకెట్టు తొడిగింది. చదరంగపు గళ్ళలంగా కట్టింది. పువ్వుల చీటిగుడ్డ టోపీ పెట్టింది. ఆ టోపీ ఆమె గుండ్రటి మొహానికి ఒక విశిష్టమయిన శోభని ఒనగూ ర్చింది. ఆమె మొహంలో అసహ్యకరమయిన రాక్షస స్వభావం వ్యక్తమవుతోంది. అందుకనే అందరిదృష్టి ఆమె నుంచి ఆమె సవతి కూతురు అందాలమొహంమీదికి మర లింది.

సిరెమోల్ నది మన ప్రయాణీకుల కంటపడింది. దూరా న్నుంచే ఆ నది చల్లదనంవచ్చి తాకింది. మండుటెండలో కాగి అలిసిపోయినవారికి చల్లదనం హాయినొనగూర్చింది. మైదానమంతటా చెల్లాచెదరుగా ఉన్న గంగరావి, బూరుగు చెట్లముదురు, లేతఆకుపచ్చ జొంపాలలోనుంచిచల్లగా మెరిసి పోతూ నీరు పొడగట్టింది. ఆ సుందరనదీలలామ వెండిలాగా ధగధగా మెరిసే వక్షస్థలంమీదనుంచి ఆచ్ఛాదన తొలగించు కుంది. చెట్ల ఆకుపచ్చని వొప్పులు దానిమీద వాలిపోతు

న్నాయి. మిసమిస్లు గొలిపే కనుబొమలు, తెల్లటి బుజాలు, నల్లటి ఉంగరాలజుట్టు కప్పిన చలువరాతి తెలుపు మెడ ప్రతి ఫలించే ఆ మనోహరవేళల, తిరస్కారబుద్ధితో ఒక నగ తీసి ఇంకొకటి అలంకరించుకునే వేళల, తలతిక్కకు అంతూ పొంతూ లేని వేళల, రమణీలలామలాగా ఆనది తనగతి ప్రతి సంవత్సరం మార్చుకుంటూ, కొత్తదారిపడుతూ, చుట్టూ వివిధ నూతన దృశ్యాలు చేకూర్చుకుంటుంది. నీటియంత్రపు బావుల భారీచక్రాలతో పెద్ద పెద్ద కెరటాలను పైకి ఎగర వేసి మళ్ళీ దభీమని పడవేస్తూ, నురుగువచ్చేటట్లు మథిస్తూ. ఆ నురుగును నలుదిక్కులకు చెదరగొడుతూ పటపటమంటు న్నాయి. మనం వర్ణించుకున్న బండి, వ్యక్తులు వంతెనను చేరుకున్నారు. గాజుపలకలాగా, రమణీయంగా, దివ్యంగా ఆ నది వారిముందు కానవచ్చింది. ఆకాశం, ఆకుపచ్చని ముదురునీలిఅడవి, మనుష్యులు, కుండలబళ్ళు, నీటియంత్రాలు సమస్తమూ ఆ నదిలో తలకిందులుగా ప్రతిఫలించాయి. ఆ ప్రతిబింబాలు ఎందుకనో పైపైనే తేలియాడుతున్నయేగాని సుందర నీలిగర్భంలోకి చొచ్చుకుపోవడంలేదు.

మన చక్కనిచుక్క ఆ దివ్యమయిన దృశ్యంకేసి తేరిపారజూసి మైమరిచింది. దారిపొడుగునా తింటూవస్తున్న పొద్దుతిరుగుడు గింజలు తినడం మరచిపోయింది. అకస్మాత్తుగా 'బలేపిల్ల!' అనే మాటలు ఆమె చెవినిబడ్డాయి. ఎవరా అని చుట్టూ చూసింది. వంతెనమీద జట్టుకూడిన పిల్లలు కనిపించారు. వాళ్ళల్లో ఒకడు తక్కినవాళ్ళకంటె పోగ్గా ఉన్నాడు. తెల్లటికోక్కా తొడిగాడు, బూడిదరంగు

టోపీ పెట్టుకున్నాడు. నడుంమీద చేతులు వేసుకుని హొయలు పోతూ వచ్చేపోయేవారివంక చూస్తున్నాడు. ఎండకు కందినా ఆ చూడ ముచ్చటయే మొహం, మెరిసిపోయే కళ్ళు ఆమె గమనించింది. ఆ కళ్ళు సూటిగా ఆమె మనసులోకి చూస్తున్నట్లు అనిపించింది. 'బలేపిల్ల!' అన్నది ఇతడే అన్న ఆలోచనవచ్చి చూపు కిందికి దింపింది. 'బలేపిల్ల!' అన్నాడు తెల్లచొక్కా కుర్రవాడు, ఆమెమీదనే నిలకడగా చూపు పెట్టి. "ఒక్క ముద్దుకి నాకు వున్నదంతా ధారాదత్తం చేస్తా! కాని ముందుకూర్చున్న ముసిలిముండను చూడాలి!"

చుట్టూ పొట్టచెక్కలయే నవ్వు వినిపించింది. కాని నింపాదిగా నడుస్తున్న రైతుభార్యకి మాత్రం ఇలాంటి స్వాగతం గిట్టలేదు. చెంపలు కందగడ్డలయాయి. తిట్లవాన ఆ యువకునిమీద కురిసింది.

"నిన్ను మరిడమ్మ యెత్తుకుపోను! తుంటరి వెధవ! నీవంశందుంప నాశనంకానూ!"

"వినండి, వినండి!" అన్నాడాయువకుడు ఆమెకేసి తేరిపారజూస్తూ, తిట్లవానకు ఆశ్చర్యపోతూ.

"అది నాలికా తాటిబద్దా? యెలా తిడుతోందో చూడండి! ముసలిముండ! నూరేళ్ళు...

"నూరేళ్ళ!" అన్నది ఆ ముసిలిది. "పాషండపు వెధవ! ఛీ! నిన్నుకన్న దేవతెరా? యెవత్తో నీచపుముండ అయివుంటుంది! నీ తండ్రో నీచపు వెధవ! నూరేళ్ళేం? చీమిడిముక్కు పంది వెధవ!"

బండి వంతెనదాటి వెళ్ళిపోయింది. ఈ ఆఖరి మాటలు వినిపించలేదు. కాని ఆ కుర్రవాడు అంతటితో పోనీయదలుచుకోలేదు. కాస్తయినా ముందూ వెనకా ఆలోచించకుండా గుప్పెడు బురద ఆమెమీద విసిరివేసాడు. ఆశించినంతకంటె ఎక్కువ ఫలితమే కలిగింది. కొత్తచీటిగుడ్డ టోపీనిండా బురద కొట్టుకుంది. తుంటరిపిల్లల కేరింతలు అధికమయ్యాయి. ఆసీటు కత్తై కోపంతో ఉడికిపోయింది. కాని ఈ లోపున బండి చాలాదూరం వెళ్ళిందేమో కోపమంతా సవితి కూతురు మీదా నింపాదిగా నడుస్తున్న భర్తమీదా తీర్చుకుంది. ఇలాంటి తుపానులు అతనికి పరిపాటే. కుక్కిన పేను లాగా భార్యతిట్టే తిట్లు వింటూ సహించి ఊరుకున్నాడు. అయితే శివారులోని సిబుల్యా అనే కోసక్ మిత్రుని ఇంటికి చేరుకునేవరకు విసుగూ విరామం లేకుండా ఆమె తిట్టిపోస్తూనే ఉంది. సిబుల్యా వారికి ప్రాణస్నేహితుడు. ఒకరినొకరు చూసుకుని చాలాకాలమయింది. చాలాకాలం తరవాత కలుసుకున్నారేమో పై విషాద సంఘటన కొంతసేపటి వరకూ మరిచిపోయి సంతను గురించి ముచ్చటించుకుని విశ్రాంతి తీసుకున్నారు.

# 2

ఐరే ! ఆ సంతలో దొరకనిదేముంది ?
చక్రాలు, కిటికీరెక్కలు, తారు,
పుగాకు, పటకాలు, ఉల్లిపాయలు,
చిల్లరసరుకులు.... జేబులో ముప్ఫయి
రూబుళ్ళు ఉన్నా సంతలోనివన్నీ కొనలేం!

—యుక్రేనియన్ సుఖాంత నాటకంనుంచి

అమితవేగంతో కిందకుదూకే జలపాతం గర్జన మీరు వినే ఉంటారు. అక్కడి గాలిహోరు, విచిత్రమయిన అస్పష్టమయిన ధ్వనులగలిబిలి మీచుట్టూ సుళ్ళు తిరుగుతుంది. కేకలతో, నవ్వులతో పటపట ధ్వనులతో విపణివీధులలో, ఇరుకు వీధులలో ఒకేఒక బ్రహ్మాండమయిన సముద్రంలా కలిసిపోయిన జనంతిరిగే సంతలో మీరు అటువంటిభావాలకు లోనుగావడంలేదా? అల్లరి, తిట్లు, అరుపులు, కేకలు - ఇవన్నీ ఒకేఒక ఘోషగా కలసిపోతాయి ఎద్దులు, గోనెలు, ఎండుగడ్డి జిప్సీలు, మట్టికుండలు, రైతువనితలు, రొట్టెలు, టోపీలు - ఇవన్నీ కాంతివంతంగా, ఆడంబరంగా, స్మృతి రహితంగా గడబిడగా, వేగంగా మీకళ్ళముందు సంచరిస్తాయి. .వివిధ గాత్రాలు ఒకదానినొకటి ముంచివేసుకుంటాయి. ఒక్క మాటకూడా వినిపించదు. ఆ గోలలో

అణగారిపోకుండా ఒక్కమాటనయినా పట్టుకోలేం. ఒక్క కేక విస్పష్టంగా వినిపించదు. అరచేతిమీద అరచేతితో చరచడం- బేరం ఖాయం చేసుకోవడ మన్నమాట - నలువేపులనుంచీ వినిపిస్తుంది. బండి దభీమని పడిపోతుంది. ఇనపసామాను గలగల, రేకుల దభదభలు చెవిని పడతాయి. తల దిమ్మెక్కి- పోయి ఎటు మరలాలో కూడా తెలియనిస్థితివస్తుంది.

మనరైతు కూతురిని వెంటబెట్టుకుని మోచేతితో దోవచేసుకుంటూ జనంలోనుంచి నడిచిపోతున్నాడు. ఒక బండ దగ్గిరికి వెళ్ళాడు, ఇంకోదానిని వేళ్ళతో తడిమి చూచాడు, ధరఅడిగాడు. కాని అతని ఆలోచన అంతా అమ్మకానికి తాను తెచ్చిన పదిబస్తాల గోధుమమీద, ఆడ గుర్రంమీద తిరుగుతోంది. గోధుమబళ్ళపక్కగా తిరగడం అతనికూతురికి ఇష్టంలేదని ఆమె మొహమే చెప్తోంది. ఎర్రరిబ్బన్లు, తగరపుబావిలీలు, రాగిశిలువలు, బంగారు నాణేలు చాందినీలకింద ఆకర్షణీయంగా ప్రదర్శించే స్థలాలకు వెళ్ళాలని కాంక్షించింది. అయితే ఆమె వెళ్ళినచోట్ల గమ నార్హమయిన వస్తువులు లేకపోలేదు. ఒక జిప్సీ, ఒకరైతు బేరం కుదుర్చుకుని ఒకరి అరచేతిమీద ఒకరు ఈడ్చి కొట్టు కోవడంతో నెప్పిపుట్టి బిగ్గరగా అరవడం అమె దృష్టిని ఆకర్షిం చింది. ఒకయూనుతాగి ఒక యువతి వీపుమీద చరచడం, ఇద్దరు బెస్త ఆడవాళ్ళు ఒకరినొకరు తిట్టుకుంటూ, రొయ్య లను పైకీ కిందకూ ఆడించడం, ఒక రష్యన్ మేకగడ్డం ఒక చేతితో దువ్వుతూ ఇంకో చేతితో - కాని ఆ సమయానికి ఆమె జాకెట్టుచేతిని ఎవరో పట్టుకులాగారు. వెనక్కు తిరిగి

చూసింది. మెరిసేపోయేకళ్ళు, ఆ తెల్లచొక్కా యువకుడు ఆమెముందు నిలబడిఉన్నాడు. ఆమె ఉలిక్కిపడింది. ఆనందంతో గానీ విచారంతోగానీ ఎన్నడూ కొట్టుకోనంతగా ఆమెగుండె కొట్టుకుంది. ఏదో విచిత్రమయిన, ఏదో సంతోషప్రదమయిన అనుభూతి కలిగింది. అదేమిటో ఆమెకే తెలియలేదు.

"భయపడబోకు, చుక్కా, భయపడబోకు!" అన్నాడా యువకుడు మందస్వరంతో, ఆమెచేతిని పట్టుకుంటూ "నీకు బాధ కలిగించేటట్టు మాట్లాడనులే!"

"బహుశా అంతేనేమో!" అని తనలోతాను ఆమె అనుకుంది. "కాని యేమిటో చిత్రంగావుంది। దెయ్యంకాదు గదా? మంచిదిగాదని తెలుసు. అయినా చేతిని వెనకకు లాక్కోలేకపోతున్నాను."

ఆరైతు వెనకకు తిరిగిచూసి కూతురితో ఏదో అనబోయాడు. ఇంతలో 'గోధుమ' అనేమాట వినిపించింది. మాయమంత్రంలాంటి ఆమాట వినిపించేసరికి బిగ్గరగా మాట్లాడుకుంటున్న ఇద్దరు ధాన్యపు వర్తకులను అతను చేరుకున్నాడు. ఇంకేమాటా వినిపించుకోలేదు.

# 3

ఈ లోకంలో ఎవరూ మెచ్చని
భల్లుక మంతటి పెనుకలు ముచ్చని
కన్నావా? వీడెలాంటివాడో విన్నావా?
—కొట్ల్యారెవస్కీ 'ఈనీడ్'* నుంచి

"అయితే మనగోధుమకిమంచిధరేపలుకుతుదంటావ్!" అని ఆ వర్తకులలో ఒకడు రెండో వానిని అడిగాడు. ఆ మొదటి వర్తకుడు పట్నంవాడిలా ఉన్నాడు. తారు అంటిన ముతకచేనేత పంట్లాం తొడిగాడు.

"మంచిధర పలుకుతుం దనుకోను" అన్నాడు రెండో వర్తకుడు. అతని నుదిటిమీద పెద్దకణితి. అక్కడక్కడా మాసికలు వేసిన ముదురు నీలిచొక్కా తొడిగాడు. "మనం ఒక్క బుషెలు గోధుమలు అమ్మగలిగితే నాచెవి తెగ్గోయించుకుంటా!"

"అదేంమాట! మనమొకళ్ళమేగా గోధుమలు అమ్మజూపుతోంది!" అని జవాబిచ్చాడు మొదటి వర్తకుడు.

---

*కొట్ల్యారెవస్కీ - యుక్రేనియన్ కవి. గొగోల్‌కి సమకాలికుడు. 'ఈనీడ్' వెర్జిల్ మహాకావ్యానికి హాస్యానుసరణ.

"మీరేమన్నా అనండి, నాదగ్గిర పదిబస్తాల గోధుమ లున్నాయి." అనుకున్నాడు మన సుందరాంగి తండ్రి. ఆవర్తకుల మాటలలో ఒకటీ పొల్లుపోకుండా వినేటువంటి వాడై.

"సరే. చూసామా, యెందులోనయినా దెయ్యం చేయి పడితే మాత్రం గిట్టుబాటు కాదు" అన్నాడు నొష్ట మీదికణితి వర్తకుడు.

"దెయ్యం చేయి పడడమేమిటి?" అని అడిగాడు చేనేత పంట్లాం వర్తకుడు.

"నలుగురూ యేమంటున్నారో వినలా?" అన్నాడు నొష్టమీదికణితి వర్తకుడు కోపంతో కోరచూపు చూస్తూ.

"అయితే?"

"అయితే అనడం తేలికే! జిల్లా సుంకాధికారి సంతకు ప్రత్యేకించిన స్థలం అచ్చిరాదు. అరిచి మొత్తుకున్నా ఒక్క గింజయినా అమ్ముడు పోదు. కొండ అడుగున అదిగో, పడి పోయిన ఆ ధాన్యంకొట్టు చూసావా?" (సరిగ్గా ఆసమయంలో మనరైతు కుతూహలం కొద్దీ వారికి ఇంకా దగ్గిరిగా వెళ్ళి బహుశ్రద్ధగా వినసాగాడు). "ఆ ధాన్యం కొట్లో దయ్యాలు గడబిడ చేస్తూంటాయి. యేదో ఒక గొడవ లేకుండా ఒకసారీసంత జరిగిన పాపాన పోలేదు. కిందటిరాత్రి జిల్లా గుమాస్తా దాని పక్కగా వెళ్లాడు. హఠాత్తుగా కిటికీదగ్గర పందిముట్టె కనిపించింది. బిగ్గరగా కుర్రుమనేసరికి నిలువెల్లా వణికిపోయాడు. ఆ యెర్రచొక్కా మళ్ళీ కనిపించవచ్చు."

"యేమైరా చొక్కా ?"

ఈ మాటలు చెవులబడేసరికి శ్రద్ధగా వింటున్న మన రైతు ఒడలు ఝల్లుమంది. భయంతో చుట్టూచూసాడు. అతని కూతురు, ఆ యువకుడు ఒకరి నడుంచుట్టూ ఒకరు చేతులు వేసుకుని ఏవేవో తియ్యటి కబుర్లు చెప్పుకుంటూ, చొక్కాల గొడవ పట్టించుకోకుండా నిలబడి ఉండడం చూసాడు. దాంతో భయం వదిలిపోయింది. మనసు కుదట పడింది.

"ఓ - నీకు ఆడపిల్లల్ని కౌగలించుకోవడం బాగా తెలిసినట్లేవుందే! పెళ్ళయిన మూడురోజులకిగాని నా క్సేనొకాని కౌగలించుకోవడం యెలాగో నాకు తెలిసిందికాదు. ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక! ఆ తెలియడమయినా ఒక స్నేహితుడి మూలంగా. అతగాడు నన్ను దోవలో పెట్టాడు."

ఆ సుందరాంగి తండ్రి మందమతిఅని గ్రహించి ఆ యువకుడు అతనిదయ సంపాదించడానికి ఎత్తు ఆలోచించ సాగాడు.

"నన్ను మీరు యెరగరేమోగాని, నేనుమాత్రం మిమ్మల్ని యిట్టే గుర్తు పట్టేశాను."

"గుర్తు పట్టావా ?"

"ఆఁ- కావలిస్తే మీపేరు, మీ యింటిపేరు, మిమ్మల్ని గురించిన సమస్త విషయాలూ చెప్పగలను. మీపేరు సొలోపీ చెరెవిక్ !"

"అవును – సాలోపీ చెరెవిక్."

"సరే, బాగా చూడండి, గుర్తుకు వచ్చానా?"

"ఉహుఁ – రాలేదు, మరేం అనుకోకేం. యెన్నో మొహాలు యిప్పటివరకు చూసాను, ఆ మొహాలన్నీ యెలా గ్యాపకం వుంటాయి చెప్పు?"

"గొలోపుపెంకో కొడుకుని మరిచేపోవడం మరేం బావుండలేదు."

"అరే, ఒఖ్రిమ్ కొడుకివా?"

"మరెవరనుకున్నారు?"

ఇంకేం ఇద్దరూ నెత్తిమీది టోపీలు తీసివేసుకుని ఒకరి నొకరు ముద్దిడుకోసాగారు. గొలోపుపెంకో కొడుకు కాలం వృధాపుచ్చకుండా ఈ కొత్త పరిచయస్తుణ్ణి బుట్టలో వేసుకో వాలని నిశ్చయించుకున్నాడు.

"సాలోపీ! మీ కూతురికీ నాకూ అనురాగం యేర్ప డింది. యిక జీవితమంతా కలసివుండాలని కోరుతున్నాం."

"బలే! పరాస్కా!" అన్నాడు చెరెవిక్ నవ్వుతూ కూతురు కేసి తిరిగి, "కలిసివుండచ్చు, ఓ వుండచ్చు. యిద్దరూ యిద్దరే. తగిపోయింది సరే నిశ్చయం చేసుకున్నట్టేనా? యిక కొత్తల్లుడా! బేరం కుదిరినందుకు యేదీ ఒకగ్లాసు మద్యం యిప్పించు!"

ముగ్గురూ ఆ సంతలో పేరుపొందిన ఒక సారా దుకా ణానికి వెళ్ళారు. దానిని ఒక యూదుయువతి నడుపుతోంది.

అందులో లెక్కలేనన్ని కూజాలు, రకరకాల సీసాలు, బుడ్లు అలంకరించబడి ఉన్నాయి.

"బలే చురుకయినవాడివే! అందుకే నువంటే నాకింత యిష్టం" అన్నాడు కొద్దిగా నిషా ఎక్కిన చెరెవిక్, కాబోయే అల్లుడు ముంతెడుసారా కనురెప్ప వెంట్రుకలు కదలించకుండా ఒక్కగుక్కలో తాగేసి, ఆ తరవాత నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేయడంచూసి "యేమంటావ్ పరాస్కా! నీకు మాంచి మొగుడిని తీసుకురాలా? చూడు యెలా తాగుతున్నాడో!"

నవ్వుతూ తూలుతూ ఆమెవెంట బండి దగ్గరకు వెళ్ళాడు. ఇక మన యువకుడు కాబోయే మామగారికి తది తరులకు బహూకరించడానికి సొగసయిన రాగికట్టు కొయ్య పైపు, పూల ఎర్రరుమాలా, టోపీకొనేందుకు అలంకార వస్తువులు అమ్మే దుకాణాలకు బయలుదేరాడు. పోల్టావా రాష్ట్రంలోని రెండు ప్రసిద్ధ పట్టణాలయిన గాడ్యాచ్, మిర్గో రోడ్ల నుంచి కూడా వర్తకులు అక్కడికి వచ్చి ఉన్నారు.

# 4

ఆయనొక టడుగుతే
ఆలొకటి కోంతే
గెలుపెవరిదో మనకు
తెలుసున్న సంగతే!

—కొట్ల్యారెవస్కీ.

"ఒసేయ్, అమ్మాయికి సంబంధం కుదిర్చాను!"

"పెళ్ళి కొడుకులకోసం గాలించడానికి యిదేనా సమయం? నువ్వట్టి తెలివి తక్కువ మొద్దువి! తెలివి తక్కువ మొద్దువి! అసలు నీపుటకే అంత! పుట్టినప్పుడే తెలివి తక్కువ మొద్దూ అని నొష్టమీద దేవుడు రాసాడు. యిటువంటి సమయంలో పెద్ద మనిషయినవాడు యెవడు పెళ్ళికొడుకులకోసం తిరుగుతాడు చెప్పూ? ఆ గోధుములు యెలా అమ్మించావాలో ఆలోచించు. వాడూ బలేవాడయి వుండాలి! యెవడో ముష్టి వెధవ!"

"అబ్బెబ్బె! ముష్టివెధవేవింటి? యెటువంటివాడో చూసి తీరాలి! వాడిచొక్కా నీ ఆకుపచ్చ రెవికె, యెర్ర బూట్లుకంటె యెక్కువ ఖరీదుచేస్తుంది! వోడ్కా యెలా తాగుతాడనుకున్నా! రెప్ప వేయకుండా ముంతెడు వోడ్కా ఒక్క గుక్కలో తాగగల మొనగాడిని నేనింతవరకూ చూడలా!"

"తాగుబోతు, తిరుగుబోతు! యింకేం నీకు నచ్చకేం చేస్తాడు? వంతెనమీద మనల్ని వేధించిన ఆ తుంటరి వెధవే యీ వెధవయి వుంటాడు! యింకా నా కంటపడలేదు. పడితేనా నాలుగూ దులిపేద్దును!"

"సరేగాని భార్యా: వాడేవీడయితేనేం? తుంటరి యెలా అవుతాడు?"

"యెలా అవుతాడా? ముసిలిమొహమా! మనం మిల్లునుదాటి వెళుతూంటే యేంజరిగిందీ చూడలా? కళ్ళు మూసుకుపోయాయా? కళ్ళముందు పెళ్ళాన్ని అవమానిస్తూంటే నోరు మెదపనివాడిని నిన్నే చూసాను!"

"యేమయినా, వాడిలో చెడేమీ నాకు కనిపించలా. శేషయినవాడు. నీ పాడుమొహానికి చక్కగా యింత పేడ పట్టించాడు. అంతేగా!"

"ఊఁ— నోరు మెదపనియవేం? యేం పొయ్యేకాల మొచ్చింది? చుక్క పడ్డట్టుందే!"

శృతిమించిందని గ్రహించి వెనువెంటనే చెరెవిక్ ఎలాగూ భార్యా తన పిలక ఎక్క దీస్తుందని అనుమానించి నెత్తిన చేతులు పెట్టుకున్నాడు.

"పెళ్ళి పెటాకులు యిలా తగలడింది!" అనుకున్నాడు తనలో తాను భార్య దూకుడుకు తట్టుకోలేక. "అకారణంగా మంచి సంబంధం వదులుకోవాలి! కరుణామయా! యిటువంటి రాక్షసిముండల్ని మానుందుకు యెందుకు తోలావు? యీ ప్రపంచంలో యెన్ని పనికిమాలిన వస్తువులు లేవు. అవి చాలవన్నట్టు యీఆడవాళ్ళను యెందుకు సృష్టించావ్?"

# 5

అడలకు ఘూరుహూషూ! నీ
బెడగు పసిమి తరగలేదు
అలసకు కోసక్ యువకా!
పడుచుదనం విరగలేదు

—యుక్రేనియన్ పాట

స్వంతబండి పక్కన కూర్చుని ఆ తెల్లచొక్కా యువకుడు చుట్టూ నానాగొడవా చేస్తున్న జనంకేసి పరాకుగా తేరిపార జూసాడు. మిట్ట మధ్యాహ్నం మంటలు మండించి అలసిపోయి సూర్యుడు మెల్లిగా జారుకుంటున్నాడు. సూర్య రశ్మి ధగధగలాడుతూ హృదయాన్నాకర్షిస్తూ క్రమ క్రమంగా మాసిపోతోంది. తెల్ల డేరాల పైకప్పులు లేత గులాబీ రంగులతో తళతళా మెరిసి పోతున్నాయి. అమ్మకానికని దొంతులుగా కిటికీలలో పెట్టిన అద్దపు బిళ్ళలు తళుక్కు మంటున్నాయి. సారా దుకాణాలలోని మేజాల మీది గిన్నెలు, సీసాలు నిప్పులాగా వెలిగి పోతున్నాయి. ఖర్బూజా, గుమ్మడికాయల రాసులు బంగారంతోనూ, రాగి తోను పోతపోసి నట్టున్నాయి. మాటలు ఎక్కువగా వినిపించ డంలేదు. అరిచీ అరిచీ అలసిపోయిన చిల్లర దుకాణదారులు, రైతులు, జిప్సీలు మెల్లగా సోమారిగా మాట్లాడు కుంటున్నారు

అక్కడక్కడా దీపాలు వెలుగుతున్నాయి. ఉడుకుతున్న బజ్జీల కమ్మని వాసన నిశ్శబ్దంగాఉన్న వీధులలోకి గుప్పున కొడుతోంది.

"యెందుకలా విచార పడుతున్నావ్, గ్రిట్స్కో!" అని ఎండకు కమిలిపోయిన ఒక పొడుగాటి జిప్సీ మన యువకుని బుజంమీద తట్టుతూ అడిగాడు. "యిరవయి రూబుళ్ళకి నీయెద్దుల్ని కొంటాను, యిచ్చెయ్."

"యెద్దులు. యెద్దులు! మీకింకేగొడవా పట్టదు! మీ జిప్సీ లందరికీ యెలా లాభాలు తీద్దామనే ఆలోచన! అమాయకుల్ని మాయచేసి మోసగించడమే మీపని!"

"ఊఁ మహావుద్రేకంలో వున్నావే! యెవత్తో ఆడపిల్ల వలలోపడి విసుగెత్తి పోయినట్టుంది ?"

"ఉహుఁ - అదేంగాదు. అన్నమాట తప్పను. శాశ్వతంగా నిలబడతాను. ఆ ముసిలి చెరివిక్ కి కాసెత్తు అంతరాత్మ అంటూ లేనట్టుంది. మాటయిచ్చి తప్పాడు. సరే, అతడిని అని ప్రయోజనమేమిటి? వట్టి గంగిరెద్దు! యివాళ వంతెనమీద మేం యెగతాళి పట్టించిన ముసిలి ముండ పనే యిదంతా. నేనే గనక జారునో, యే మహారాజునో అయితే అడవాళ్ళ చెప్పుచేతల్లో మెలిగే యెగ దద్దమ్మలందర్నీ వురితీయిద్దును!"

"చెరివిక్ పరాస్కాని నీకిచ్చి పెళ్ళిచేసేట్టుచేస్తే నీ యెద్దుల్ని నాకు యిరవయి రూబుళ్ళకి అమ్ముతావా?"

గ్రిట్స్కో ఆశ్చర్యపోతూ అతనికేసి తేరిపారజూచాడు. ఆ జిప్సీ నల్ల మోహంలో కావేషం, ద్వేషం, నీచత్వం,

పొగరుబోతుతనం గోచరించాయి. అతనివంక చూస్తే ఆ విచిత్ర వ్యక్తిలో గొప్ప గుణాలు ఏవో ఉన్నాయని గుర్తిస్తాం. కాని వాటికి ప్రతిఫలం ఉరికంబమే! ముక్కుకు, కొనదేలిన గడ్డానికీమధ్య నోరు అణగారిపోయింది. నవ్వులో వెక్కిరింత గోచరిస్తుంది. కళ్ళు చిన్నవి. నిప్పులు కక్కుతుంటాయి. మొహంలో సతతమూ కుట్ర, సాహసమూ మెరుపులా తళుక్కుమంటూంటాయి. ఇవన్నీ అతని విచిత్ర వేషానికి తగినట్టే ఉన్నాయి. ముట్టుకుంటే నుసి అయిపోయే టట్టున్న ముదురు గోధుమరంగు కోటు, జడలుకట్టి బుజాల మీద పడే పొడుగాటి నల్లజుట్టు, ఎండకు కమిలిపోయిన పాదాలకు చెప్పులు, ఇవన్నీ అతనినుంచి వేరుచేయలేనివిగా ఉన్నాయి.

"నన్ను మోసపుచ్చకపోతే యిరవయి యేమిటి పది హేను రూబుళ్ళకే యిచ్చేస్తాను" అని ఆ యువకుడు జవాబిచ్చాడు జిప్సీవంక పరీక్షగా తేరిపార జూస్తూ.

"పదిహేనా? సరే. మరిచిపోకేం పదిహేను! యిదిగో బజాణాకింద అయిదు రూబుళ్ళు తీసుకో!"

"మోసగిస్తేనో?"

"బజాణా వదులుకుంటాను."

"సరే మంచిది. బేరం ఖాయమే"

"ఖాయమే!"

## 6

ఆరిభగపంతుడా! నా భర్త
వస్తున్నాడు. ఇంకొక నిమిషంలో
వచ్చి నన్ను చితకతన్ను
తాడు. యిక పాన్ ఖోమా,
నువ్వా బతికి బయట పడలేవు.

—ఒక యూక్రేనియన్ సుఖాంత నాటకంనుంచి.

"యీదారినరా, అఫనాసీ యివనోవిచ్! యిక్కడ కోరడి యెత్తుతక్కువ. యెత్తి అడుగువెయ్, భయపడబోకు. మా ముసిలి పీనుగ యెవరూ యేమీ యెత్తుకుపోకుండా బండి కింద పండుకోవడానికి నేస్తంతో వెళ్ళిపోయాడు."

ఈ విధంగా చెరెవిక్ భార్యారత్నం కోరడి పట్టుకుని బిగులు బిగులుమంటూ వేలాడుతున్న పాదరీ కొడుకుని ప్రోత్సహించింది. అతనూ కోరడిమీదికి ఎక్కి, కొంచెంసేపు తటపటాయిస్తూ భూతక్కి బొమ్మలా దూకటానికి మంచి చోటు ఏదాఅని వెతుకుతూ నిలబడ్డాడు. చివరికి ఎలాగయితేనేం దభీమని కలుపుమొక్కలమధ్య వచ్చిపడ్డాడు.

"మరేం దెబ్బ తగలలేదుగదా! భగవంతుడి దయవల్ల మెడ విరగలేదు నయమే" అంది ఖివ్యా ఆదుర్దాగా.

"యిస్! మరేం పరవాలేదు, పరవాలేదు, ప్రియము యిన ఖ్రవోన్యానికిఫోరోవ్నా!" అన్నాడాతడు మెల్లిగా లేస్తూ. "యేదో పాములాంటి యీ దురదగొండి కొంచెం బాధించిందనుకో."

"లోపలికి వెళదాం రా. లోపల యెవరూ లేరు. యిప్పటిదాకా రాకపోతే నీకు యే కడుపునెప్పో వచ్చిందను కున్నాను, అఫనసీ యివనోవిచ్! బావున్నావా! మీనాన్నకు యేదో లప్ప దొరికిందని విన్నాను?"

"అబ్బే! చెప్పుకోతగినంతేం దొరకలేదు. వుపవాసపు రోజుల్లో యింతాచేస్తే పదిహేను బస్తాల గోధుమలు, నాలుగు బస్తాల జొన్నలు, వందరొట్టెలుమాత్రం దొరికాయి. యిక కోడిపిల్లలు యాభైకూడ దొరకలా. కోడిగుడ్లు చెడిపో యాయి. కాని నిజానికి తియ్యటి కానుకలు దొరికితే నీదగ్గరే దొరకాలి." అంటూ అతను మొదలుపెట్టాడు ఆమె దగ్గరకు జరుగుతూ, ప్రేమదృష్టులు బరపుతూ.

"యివిగో కానుకలు!" అందామె. మేజామీద కొన్ని గిన్నెలు పెడుతూ, కావాలని ఊడదీసి పెట్టుకున్నట్టు అనిపించ కుండా రెవిక గుండీలు పెట్టుకుంది సిగ్గు నటిస్తూ.

"యివిగో గోధుమ పూరీలు, రొట్టెలు, మిఠాయి!"

"యివెవో మహాసుందరాంగి సుందర హస్తాలతో చేసినవయి వుంటాయి!" అన్నాడు రొట్టెలపని పట్టిస్తూ తక్కి నవి రెండో చేతితో దగ్గరకు లాక్కుంటూ. "యీమిఠాయిలు

గిటాయిలుకంటె తియ్యని కానుకకోసం నా మనసు తహతహ లాడిపోతోంది''

''యింతకంటె నీకు వేరే యేం తీపిపదార్థం కావాలో నాకు అర్థం కావడంలేదు'' అంది ఆ కులుకులాడి ఏమీ ఎర గని నంగనాచిలాగా.

''నీ ప్రేమ, సాటిలేని ఖ్రవోన్యాదానికిఫారోవ్నా!'' అని మెల్లగా ఆమె చెవిలో అన్నాడు ఒకచేతిలో రొొట్టె పట్టుకుని రెండో చేతితో ఆమె సన్నని నడుము చుట్టివేస్తూ.

''యేమిటీ పిచ్చిమాటలు'' అందామె సిగ్గుతో నేల వంక చూస్తూ. ''ఆపైన ముద్దెట్టుకుంటావనుకుంటా!''

''ఆ విషయమా'' అంటూ ఆ యువకుడు మొదలు పెట్టాడు.'' నేను బళ్లో చదువుకునేటపుడే నాకు బాగా జ్ఞాపకం—''

సరిగా ఆ సమయానికి గేటులో కుక్క మొరుగు, తలుపు కొట్టిన చప్పుడు వినవచ్చాయి. ఖ్రవ్రా బయటికి పరు గెత్తుకువెళ్ళి తెల్లమొహం వేసుకుని తిరిగివచ్చింది.

''అఫనాసీయివనోవిచ్! మనం పట్టుబడిపోయాం. జనం బోలెడుమంది తలుపు కొడుతున్నారు. సిబుల్యా గొంతు విని పిస్తున్నట్లుంది?''

రొట్టె ఆ యువకుని గొంతులో పట్టుకుంది. మరో లోకపుమనిషి కంటపడినపుడు లాగా అతనిగుడ్లు ముందుకు పొడుచుకువచ్చాయి.

"దానిమీదకు యెక్కు" అంటూ ఖిర్వ్యా భయపడి పోయి, లోకప్పుకింద దూలాలమీది బల్ల చెక్కలకేసి చూపిం చింది. వాటిమీద రకరకాల సామాగ్రి పడిఉంది.

అపాయం మన వీరుడికి ధైర్యాన్ని ప్రసాదించింది. స్టోవ్ మీదకి ఎక్కి అక్కడినుంచి జాగ్రత్తగా బల్లచెక్కల మీదకు ఎగబాకాడు. తలుపుచప్పుడు నిమిష నిమిషానికీ ఎక్కువ అయేసరికి ఖిర్వా తొందరగా గేటుదగ్గరకు పరు గెత్తింది.

# 7

**అద్భుతం జరిగిందిబాబూ!**

—యుక్రేనియన్ సుఖాంతనాటకం నుంచి.

సంతలో విచిత్రమయిన సంఘటన జరిగింది, సరుకుల మధ్య ఎక్కడో 'ఎర్రచొక్కా' కనిపించిందని పుకారు అంతటా వ్యాపించింది. రొట్టెలు అమ్మే ఒక ముసలమ్మకి దెయ్యపు రూపంలో బండిమీదకు వంగి ఏదో వెదుకు తున్నట్టు కనిపించిందట. ప్రశాంతంగా ఉన్న సంత నలుమూ లలకీ ఈ వార్త పాకింది. ఆ ముసలిదాని దుకాణం పక్కనే కల్లుదుకాణం ఉంది తప్పతాగి తూలుతున్నా ఆమెమాట విశ్వసించక పోవడం ఘోర అపరాధంగా అంతా భావిం చారు. జిల్లాగుమాస్తా కూలిపోయిన ధాన్యం కొట్టులో చూసిన అద్భుత కథకు చిలవలు పలవలు అల్లి దీనికి జోడిం

చారు. అందువల్ల చీకటి పడగానే జనం అంతా ఒకచోట గుమిగూడారు. మనశ్శాంతి మాయమయింది. కన్ను మూయడానికి కూడా భయపడి పోయారు. ఏ గుడిసెలోనో బస దొరికిన కొంతమంది భయస్తులు చల్లగా వారివారి బసలకు జారుకున్నారు. చెరెవిక్, అతని కూతురు, స్నేహితుడు సిబుల్యా వెంటవచ్చిన ఇతర మిత్రులు గేటు గట్టిగా కొట్టడంతో ఖివ్ర్యా భయపడి పోయింది. సిబుల్యా అప్పటికే తప్పతాగి తూలుతున్నాడు. చుట్టూ రెండుసార్లు తిరిగితేనేగాని గుడిసె కనిపించలేదు. ఇక అతిథులు కూడా హుషారుగానే ఉన్నారు. మర్యాద పాటించకుండా యజమానికంటె ముందే గుడిసెలో చొరబడ్డారు. గుడిసె నలుమూలలా వారు తిరగవేస్తూంటే చెరెవిక్ భార్య ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంది.

"యేమిటి, యేం వచ్చిపడింది?" అని అడిగాడు సిబుల్యా లోపలికి అడుగుపెడుతూ.

"జ్వరం రాలేదుగదా?"

"ఊఁ-వంట్లో బావుండలేదు" అని జవాబిచ్చింది ఖివ్ర్యా పైకి ఆందోళనతో చూస్తూ.

"ఒసేయ్, బండిలోంచి సీసా తీసుకురా!" అన్నాడు సిబుల్యా. "అందరం కలిసి ఖాళీచేస్తాం. ఆ ఆడముండను ఒకటే భయపెట్టేసాను. చెప్పుకోడానిక్కూడా సిగ్గేస్తోంది. అవును, నేస్తాలూ, మనం యిక్కడికి వచ్చేయడంలో అర్ధం పర్ధం కన్పించదు" అంటూ కొనసాగించాడు మట్టికూజా నోటికి చేరుస్తూ.

"మనల్ని నవ్వులపాలుచేయాలనే ఆ ఆడాళ్లు యీఎత్తు ఎత్తారు. సైతాను వచ్చినా - సైతాను యెవరు? వాడిమొహం మండ! యీ నిమిషంలో గనక నాకంట పడితేనా ముక్కునులిపేయకపోతే మారుపేరు పెట్టండి!"

"అలా అయితే తెల్ల మొహం వేస్తావెందుకు?" అని అడిగాడు ఆగంతుకులలో ఒకడు. ఆయన అందరిలోకీ పొడ వయినవాడు. మహాధైర్యస్తుడిలా ప్రవర్తించాలని తంటాలు పడుతూంటాడు.

"నేనా? నువేదయినా కలగంటున్నావా?"

ఆగంతుకులు నవ్వారు. గప్పాలుకొట్టే పీసుడు తృప్తిగా మందహాసం చేసాడు.

"యిపుడు తెల్ల మొహం వేయగలడంటావా?" అన్నాడొకడు. "చెంపలు గసగసాలంత యెర్రగావున్నాయి. యిపుడు యితడు సిబుల్యా యేంకాదు. (అంటే యుక్రెయిన్ భాషలో ఉల్లిపాయ) బీటుదుంప! బీటుదుంపా కాదు. అందరినీ జడిపించిన 'ఎర్రచొక్కా'."

కూజా నలుగురి చేతుల్లోకీ తిరిగేసరికి హుషారు హెచ్చింది. చెరెవిక్ మనస్సింకా శాంతించక ఎర్రచొక్కావాడి విషయమయి ఇంకా వ్యాకులపడుతూ స్నేహితుని అడిగాడు:

"యీ యెర్రచొక్కా వెధవని గురించి యెవరిని అడిగినా ఒక్కరూ సూటిగా జవాబు చెప్పి చావడంలేదు. నువన్నా చెప్పుమా!"

"చీకటిపడేముందు చెప్పదగిన విషయంకాదది. నిన్నూ, నీలాగా యీ విచిత్రచేష్టలు వినాలని కుతూహలపడే యీ మిత్రుల్ని సంతృప్తిపరచడానికి చెప్తా విను."

సిబుల్యా బుజాలు గోక్కుని, కోటు అంచుతో మొఖం తుడుచుకుని, మేజామీద రెండు చేతులూ ఆనించి ఇలా చెప్పసాగాడు.

"ఒకానొకప్పుడు నరకలోకంలోనుంచి దెయ్యాన్ని బయటికి తన్ని తరిమేశారు. యెందుకో దేవుడికే తెలియాలి."

"యెలా?" అంటూ అడ్డువచ్చాడు చెరెవిక్.

"నరకలోకంనుంచి దెయ్యాన్ని తరిమేయడం యెలా సంభవించింది?"

"నాకు తెలీదు. యింటోనుంచి కుక్కని తరిమేసినట్టు తరిమేసారన్నదిమాత్రం వాస్తవం. బహుశా మంచిపని యేదో చేసివుంటుంది, యింకేం బయటికి నడవమన్నారు. పాపం! ఆ దెయ్యానికి యింటిబెంగ! నరకంమీద బెంగపెట్టుకుని వురేసుకు చావడానికిసిద్ధమయింది. అవును, మరిచేసే దేవుంది? బెంగ భరించలేక తాగుడు మొదలుపెట్టింది. కొండకింద కనిపించడంలా, కూలిపోయినకొట్టు! అందులో స్థిరంగానివాసంయేర్పరచుకుంది. అందుకనే దారిపోయేవాళ్ళు శిలువగుర్తు వేసి మరీ వెళతారు. అటువంటి పోకిరీనిమనం చూడం. పగలల్లా సారా దుకాణంలోనే కూర్చోడం."

ఈ ఘట్టంలో చెరెవిక్ మళ్ళీ అడ్డువచ్చి, "యేమిటి నువు చెప్పేది? దెయ్యాన్ని యెవరన్నా సారా దుకాణంలోకి

రానిస్తారా? దానికి గోళ్ళు, కొమ్ములు వున్నాయనుకుంటా. లేవూ?"

"ఆఁ– అదిగదీ సంగతి. నెత్తిమీదటోపీ, చేతికి తొడుగులూ వున్నాయి. యెవరు గుర్తుపట్టి చావగలరు? వున్నదంతా తాగుడికింద తగలేసింది. చాలాకాలంపాటు అప్పు పెట్టారు. చివరకు అప్పుపెట్టడం మానేశారు. సారోచిన్ట్స్ని సంతలో నోడ్కా అమ్మే ఒక యూదుకు యెర్ర చొక్కా దాని ఖరీదులో మూడోవంతుకి తాకట్టు పెట్టవలసి వచ్చింది. తాకట్టు పెట్టి అన్నదీ: 'సంవత్సరం అయాక వచ్చి నా చొక్కా తాకట్టు వదిలించి తీసుకుపోతాను. అప్పటివరకు జాగ్రతగా కాపాడుతూవుండు!' యిలా చెప్పి మాయమయి చక్కాబోయింది. మరి కనిపించలేదు. ఆ యూదు చొక్కా బాగా పరీక్షగా చూసాడు. మిర్గొరోడ్‌లో కూడా అటువంటి గుడ్డ దొరకదు. బహుమంచిది. రంగు నిప్పులాగా వెలిగిపోతోంది. దృష్టి మరలించాలని బుద్ధిపుట్టదు. సంవత్సరం యుగం అనిపించింది. తల గోక్కుని చొక్కా అమ్మేయాలని నిశ్చయించుకుని దారిపోయే పెద్దమనిషికి యాభై రూబుళ్ళకి అమ్మేశాడు.

"వాయిదా తేది ఆ యూదుకి జ్ఞాపకమే లేదు. ఒకరోజు సాయంత్రం ఒకమనిషివచ్చి 'నాచొక్కా నాకిచ్చేయి' అని అడిగాడు. మొట్టమొదట్లో ఆయూదు ఆమనిషినిగుర్తుపట్టలేదు. పరీక్షగా చూసినపిమ్మట గుర్తుపట్టాడుగాని యెరగనట్లు నటించాడు. 'యేం చొక్కా? నా దగ్గర చొక్కాయేదీ లేదే! నీ చొక్కాసంగతి నా కేం తెలుసు?' ఆ వచ్చినమనిషి వెళ్ళి

పోయాడు. చీకటిపడగానే ఆ యూదు గదిలో గడియ వేసుకుని కూర్చుని ఇనపపెట్టెలోని డబ్బు లెక్కపెట్టి బుజాలమీద దుప్పటి కప్పుకుని యూదుమతపద్ధతిలో ప్రార్థన మొదలు పెట్టాడు. హఠాత్తుగా గలగలా చప్పుడయింది. తలెత్తి చూసాడు. యే కిటికీలోచూసినా పందిముట్టెలే కనిపించాయి!"

సరిగ్గా ఆ సమయానికి పందిగుర్రులాంటిశబ్దం అస్పష్టంగా వినిపించింది. అందరూ తెల్లమొహాలు వేసారు. సిబుల్యాకు ముచ్చెమటలుపోసాయి.

"యేమిటది?"అని అడిగాడు చెరెవిక్ భయపడిపోయి.

"మరేంలేదు"అని జవాబిచ్చాడు సిబుల్యా నిలువునా వణకిపోతూ.

"ఆఁ."అన్నాడు అతిథులలో ఒకడు.

"యేమిటో అంటున్నావే?"

"అబ్బే!"

"మరి గుర్రుమన్నదెవరు?"

"యెందు కింత కంగారు, అర్థం కావడంలేదు. యిక్కడ మనంతప్ప యింకెవరూ లేరాయె?"

భయంతోచుట్టూచూసి మూలమూలా వెతకసాగాడు. ఖివ్ర్యాలో ఎక్కడా జీవకళలేదు.

"మీరు వట్టి ఆడంగులు!"అందామె బిగ్గరగా. "మీరు కోసక్ లేనా? రాటం వడుకుతూ కూర్చోండి సరిపోతుంది. బహుశా యేదో బల్ల కిర్రుమంటే పిచ్చివాళ్ళల్లా హడిలిపోతిరి!"

దీంతో మన వీరులు సిగ్గుపడి, మళ్ళీ ధైర్యంచిక్కబట్టు కున్నారు. సిబుల్యాకూజాలోది ఇంత నోడ్కాతాగి కథ కొన సాగించాడు :

"ఆ యూదు భయంతో మూర్ఛబోయాడు. కాని ఆ పందులు పూతకోలలంత కాళ్ళతో కిటికీలలో నుంచి కిందికి దిగి తోలుపట్కా కుచ్చులతో కొట్టి క్షణంలో స్పృహవచ్చేటట్టు చేసాయి. ఆ దెబ్బలకు ఆ యూదు దూలాలకంటె ఎత్తు ఎగిరాడు. కాళ్ళమీద పడి అంతా ఒప్పుకున్నాడు. కాని చొక్కామాత్రం తిరిగి ఇచ్చేమార్గం లేకపోయింది. చొక్కా కొనిన పెద్దమనిషి దగ్గరనుంచి రోడ్డుమీద ఒక జిప్సీ కొట్టేసి ఒకస్త్రీకి అమ్మాడు. ఆమె దానిని తిరిగీ సొరోచిన్ట్సా సంతకు తీసుకువచ్చింది. కాని ఆ తరవాత ఆమెదగ్గర ఎవరూ ఒక్కవస్తువూ కొనలేదు. ఆమె ఆశ్చర్యపోయి, ఆశ్చర్యపోయి చివరకు దోషం ఎక్కడుందో గ్రహించింది. దీనికంతకీ కారణం ఎర్రచొక్కా అని తేల్చు కుంది. అందుకే తొడుక్కుంటే బిగుతుఅయింది! ఇంకేం ఒక్క క్షణంకూడా ఆలోచించకుండా నిప్పులో పడవేసింది. కాని ఆ దయ్యపుచొక్కా తగలబడలేదు. 'ఓ - యిదిదెయ్యం చొక్కా' అని నిర్ధారణచేసుకుంది. వెన్నఅమ్మడానికి సంతకు వచ్చిన ఒక రైతుబండిలో ఆ చొక్కాను కుక్కింది. పాపం! ఆ తెలివితక్కువ మొద్దు సంతోషించాడేగాని ఒక్కరూ అతని దగ్గర వెన్నకొనలేదు. 'యీ యెర్రచొక్కా యెవరో దుర్మా ర్గులు నా నెత్తినకుద్దారు' అనుకుని గొడ్డలి తీసుకుని ఆ

చొక్కాను ముక్కలుముక్కలుక్రింద చీల్చేసాడు. తీరా చూసే సరికి ఒకొక్కముక్కా పక్క ముక్కతో కలిసికొని మళ్ళీ చొక్కా యథాప్రకారం తయారయింది. శిలువగుర్తు వేసి మళ్ళీ గొడ్డలిపుచ్చుకుని నరకడం మొదలుపెట్టాడు. ముక్క లన్నింటినీ అక్కడ నాలుగువైపులావిరజిమ్మి చక్కాబోయాడు. ఆ నాటినుంచీ ఆ దెయ్యం పందిమొహంవేసుకుని గుఱ్ఱు గుఱ్ఱు మంటూ ఆ చొక్కా ముక్కలు ఏరుకుంటూ సంతఅంతటా తిరుగుతోంది. చొక్కా ఎడమచేయి ఇంకా దొరకలేదంటు న్నారు. నాటినుంచీ జనం ఎవరూ ఆ ప్రాంతాలకు వెళ్ళడం లేదు. అక్కడ సంతజరిగి పదిఏళ్ళయింది. కాని ఒకదుర్ముహూ ర్తంలో —"

తక్కిన మాటలు అతని పెదవుల మీదనే కరుడు గట్టుకు పోయాయి. కిటికీదగ్గర పెద్దగా చప్పుడయింది. అద్దాలు భళ్ళున నేలమీదపడ్డాయి. చూడడానికి భయంకరమయిన పందిమొహం గుడ్లు మిటకరిస్తూ తేరిపారజూసి "యిక్కడేం జేస్తున్నారు మహాజనులారా?" అని అడిగిన ట్లనిపించింది.



# 8

ఉసురుకొట్టినట్లు వణికి
కసుకున నాలుకను కరిచె
ముక్కువెంట నెత్తురోడ
కుక్కలాగ తోకముడిచె !

— కోట్ల్యారెవస్కీ 'ఈనీడ్' నుంచి

గదిలో ఉన్న ప్రతిఒక్కరూ భయంతో మొద్దుబారి పోయారు. సిబుల్యా స్థబ్ధుడయిపోయి నోరు తెరచుకుని చూడ సాగాడు. గుడ్లు తుపాకిగుళ్ళలాగా ముందుకు పొడుచుకుని వచ్చాయి. చాచిన చేతివేళ్ళు చలనం లేకుండా గాలిలోనే ఉండిపోయాయి. భయం విపరీతమయిపోయింది. ఆ 'మహా వీరుడు' ఎగిరిపడ్డాడు. తల దూలానికి టంగున తగిలింది. దూలంమీద బల్లచెక్కలు కదిలిపోయాయి. ఫాదిరీగారి కొడుకు దభీమని నేలమీద వచ్చి పడ్డాడు.

"ఒహోహో !" అన్నాడొకడు నిరాశతో, భయంతో బెంచీబల్లను గట్టిగా పట్టుకుని. కాళ్ళూ చేతులూ గడగడా వణికిపోయాయి.

"సాయంరండి బాబూ !" అని అరిచాడు ఇంకొకడు గొర్రెచర్మంలో తలదాచుకుంటూ.

రెండోసారి బీభత్సం జరిగేసరికి సిబుల్కా మైకంనుంచి తేరుకుని వణికిపోతూ పాక్కుంటూ వెళ్ళి భార్యాగారి కింద దూరాడు. ఆ తరవాత మెల్లగా ఆ 'శవాసుడు'కంత చిన్నదయినా పొయ్యిలోకి దూరి తలుపు వేసుకున్నాడు. చెరెవిక్ టోపీబదులు కుండను తలమీద బోర్లించుకుని కాలుగాలిన పిల్లిలాగా చర్రున పరుగెత్తి పిచ్చి ఆవేశంతో వీధులవెంట తిరగసాగాడు. అలిసిపోయి నడకవిసురుతగ్గించాడు. గుండె నూనె మరలాగా టకాటకా కొట్టుకోసాగింది. చెమటకాలువలుకట్టింది. శోషవచ్చి నేలమీద పడిపోయాడు. ఇంతలో హఠాత్తుగా ఎవరో వెనక పరుగెత్తుకు వస్తున్న చప్పుడు వినిపించింది. ఊపిరి ఆడలేదు.

"దెయ్యం! దెయ్యం!" అని పిచ్చిగా అరిచాడు. పారిపోవాలని గట్టిగా యత్నించాడు. కాని మరుక్షణంలో తెలివితప్పి నేలమీద పడ్డాడు.

"దెయ్యం! దెయ్యం!" అనే కేక అతని వెనకగా వినిపించింది. మీద దభీమని ఏదో పడ్డట్టు ఒకటే అతనికి తెలిసింది. స్మారకంతప్పి,శవపేటికలో శవంలాగా, రోడ్డుమధ్యన కదలకుండా పడిఉన్నాడు.

# 9

ముందు అందరి మాదిరే
వెనక, బాబో, దెయ్యం!
— ఒక జానపద గాథనుంచి.

ఆ రాత్రి ఆరుబయట గడుపుతున్న జన సమూహం లోని ఒకడు హఠాత్తుగా లేచి కూర్చుని,

"వినిపించిందా, వ్లాస్? యెవరో దెయ్యం అంటున్నారు!" అని అడిగాడు.

"అంటేనేం?" అంటూ పక్కనఉన్న జిప్సీ సణిగి కాళ్ళు చాచుకున్నాడు. "దెయ్యాలసంగతి మాట్లాడుకోనియ్, మందేంపోయింది."

"గొంతు నులుమబడుతూన్నట్లు అరిచాడు మరి?"

"నిద్రట్లో అనేకవిధాలుగా అరుస్తారు."

"కావచ్చు. అయినా చూడడం మంచిది. దీపం వెలిగించు."

ఆ రెండో జిప్సీ సణుగుకుంటూ లేచి మెరుపు తళుకులలాగా నిప్పురవ్వలుచేసి దూదివత్తి ఊదివేసి దీపం పుచ్చుకుని బయలుదేరాడు. యుక్రెయిన్ దీపం, అంటే మట్టిచిప్పలో కొవ్వువేసి వత్తి వెలిగించింది.

"ఆగు! యిక్కడేదో పడుంది. దీపం యిలాచూపించు"

ఇంకా అనేకమంది వచ్చి చేరుకున్నారు.

"యేమిటిది వ్లాన్ ?"

"యిద్దరు మనుషులు, ఒకరిమీద ఒకరుపడి వున్నారు. యిద్దరిలో దెయ్యం యేదో తెలియడంలేదు!"

"ఊఁ- పైనవున్న దెవరు ?"

"ఆడది!"

"ఆఁ-యింకేం అదే దెయ్యం!"

వీధి అంతటా నవ్వులతో హోరెత్తిపోయింది.

"మగాడిమీద ఆడది! స్వారీచేయడం బాగా తెలిసిన దానిలా వుంది!" అన్నాడు పక్కన నిలబడ్డవారిలో ఒకడు.

"చూడండి!" అన్నాడు ఇంకొకడు, కుండముక్క పైకితీస్తూ. చెరెవిక్ తలమీది కుండ పగిలి సగం మాత్రమే తలమీద మిగిలిఉంది. "ఒహో యెంత పసందయిన టోపీ పెట్టుకున్నాడో చూడండి!"

నవ్వులు, గందరగోళాలకు ఆ శవాలకు ప్రాణం తిరిగివచ్చింది. చెరెవిక్, అతని పెండ్లాం భయం ఇంకా వదలక జిప్సీల మొహాలవంక భీతితో తేరిపారజూసారు. ఆ మసక మసక వెలుతురులో నిరంతర నిశాంధకారంలో నరకలోకం లోని ఆవిరిలో స్నానమాడిన పిశాచగణంలా వారు కనిపించారు.

# 10

ఛీ! ఛీ! సైతాను
ప్రతిరూపమా !
—యూక్రేనియన్ సుఖాంతనాటకంనుంచి

ఉదయమయింది. చల్లగాలి తగిలి సొరోచిన్‌ట్సీవాసులు నిద్ర మేలుకొన్నారు. పొగ గొట్టాలనుంచి పొగ మబ్బులు సూర్యుని కలుసుకోవడానికి పైకి లేచాయి. సంత కళకళలాడుతోంది. గొర్రెలు అరుస్తున్నాయి. గుర్రాలు సకిలిస్తున్నాయి. బాతుల అరుపులు, దుకాణస్త్రీల అరుపులు తిరిగీ డేరాలలో ప్రతిధ్వనించసాగాయి. చీకటివేళ భయోత్పాతం కలిగించిన ఆ ఎర్రచొక్కా భయంకరగాధలు తెల్లవారేసరికి అణిగిపోయాయి.

నిద్రమత్తుతో కాళ్ళు జాపుకుని ఆవులిస్తూ సిబుల్యా పూరిగుడిసెలో ఎద్దులమధ్య, గోధుమపిండి బస్తాలమధ్య చెరెవిక్ పడి ఉన్నాడు. స్వప్నప్రపంచం వదిలి బయటికి రావడం అతనికి ఇష్టంలేనట్టుంది. కాని ఇంతలో చిరపరిచితమైన గొంతువచ్చి చెవులో పడింది.

"యిక లేవచ్చు! లేవచ్చు!" అంది అతని సుకుమారి భార్యబలంకొద్దీ అతనిచేతిని పట్టి లాగుతూ.

జవాబు చెప్పకుండా చెరెవిక్ బుగ్గలుపూరించి మద్దెల వాయించేవాడిలాగా రెండు చేతులూ ఆడించసాగాడు.

"వెర్రిదద్దమ్మా!" అని ఆమె అరిచింది మొహంమీదికి వచ్చిపడుతున్న చేతులబారినుంచి తప్పించుకుంటూ.

చెరెవిక్ లేచి కూర్చుని, కళ్ళు నులుముకుని చుట్టూ చూసాడు.

"నీ మొహం మద్దెలవున్నట్లుంటే వాయించబుద్ధి పుట్టింది. యేంచావను!"

"యేమిటా పిచ్చిమాటలు, చాల్లే, తొందరగా లేచి గుర్రాన్ని సంతకు తీసుకువెళ్ళు. నలుగురిలో నవ్వులపాలయాం. సంతకొచ్చి గుప్పెడు నారన్నా అమ్మలేకపోయాం!"

"అవునవును. తప్పకుండా మనల్ని చూసి నవ్వుతారు" అంటూ అంగీకారం సూచించాడు చెరెవిక్.

"పద, పద. నవ్వుతారేమిటి నవ్వుతూంటే!"

"కాని నేనింకా స్నానమే చెయ్యలేదు." అన్నాడు చెరెవిక్ కాలహరణంకోసం ఆవలిస్తూ, వీపు గోక్కుంటూ.

"వంటి శుభ్రతకోసం యింత గొడవ చేస్తున్నావేం. యెన్నడూలేంది యివాళ శుభ్రంకావాల్సివచ్చిందా? యిదిగో తువాలు, పాడుమొహం తుడుచుకో."

నలిగి కిందపడిఉన్న దేదో తీసి ఇవ్వబోయి నిశ్చేష్టితురాలయి కిందికి జారవిడిచింది. ఎర్రచొక్కా చేతి పట్టీ!

"వెళ్ళి నీ పనేవిఁటో నువ్వు చేసుకో" అందామె సంబా ళించుకుని భర్త భయంతో కొయ్యబారిపోవడం, గొణుక్కో వడం చూసి.

"యిక అమ్మకం అయినట్టే!" అని అతను తనలో తాను గొణుక్కున్నాడు, గుర్రాన్ని ఊడదీసి సంతకుపోతూ. "యీ దౌర్భాగ్యపు సంతకు బయలుదేరడానికి సన్నాహం చేస్తుంటే నా మనసు, చచ్చిన ఆవును వీపుమీద వేసినంత, బరువెక్కింది. యెద్దులు రెండుసార్లు మొరాయించి యింటిదోవ పట్టాయి, యిందుకేననుకుంటా! యిపుడు ఆలోచిస్తే సోమవారం బయ లుదేరాంకాదూ, అందుకే యేదీ సవ్యంగాజరగడంలేదు. ఆ వెధవ దెయ్యానికి నిద్రపట్టుతున్నట్టూ లేదు. ఒంటిచేతి చొక్కా యెలా తొడుక్కుంటుంది?. అందుకె జనాన్ని నానా తిప్పలూ పెడుతోంది. నేనే దెయ్యాన్నయితే వెధవ గుడ్డపేలికలకోసం గాలిస్తూ రాత్రిపూట తిరుగుతానా!"

చెరెవిక్ ఆలోచనలకు ఒక బొంగురుగొంతు అంత రాయం కలిగించింది. పొడుగాటి జిప్సీ ఒకడు ముందు నిలబడి ఉన్నాడు.

"అమ్మకానికి యేఁం తెచ్చావ్, బాబా!"

చెరెవిక్ ఒకనిమిషం మౌనంవహించాడు. జిప్సీని ఎగా దిగాచూసి తొణకకుండా, ఆగకుండా కళ్ళెం విడిచిపెట్టకుండా.

"నీ కళ్ళతోనే చూడు" అన్నాడు.

"కళ్ళెం?" అన్నాడు జిప్సీ చెరెవిక్ చేతిలోని కళ్ళెంకేసి చూస్తూ.

"అవును. గుర్రం కళ్ళెంలాంటి దయితే!"

"యెందుగడ్డితప్ప యింకేం మేతపెడుతున్నట్టులేదే?"

"గడ్డి?"

చెరెవిక్ కళ్ళెంవదిలి గుర్రాన్ని ముందుకు తోసి ఆ సిగ్గుమాలిన అబద్ధాలకోరుమాట వమ్ముచేయాలని చూసాడు గాని ఆతనిచేయి అతిసులువుగా కదిలి అతనిగడ్డంమీాదనే ఛాళ్ళునపడింది. ఏమిటా అని చూసాడు. ఇంకేముంది, చేతిలో ఊడినకళ్ళెం, కళ్ళానికికట్టి – అమ్మో! వెంట్రుకలు నిక్కబొడు చుకున్నాయి – ఎర్రటి చొక్కాచేయి! కాండ్రించి ఊసి, శిలువగుర్తు వేసి, చేతులుజాడించుకుని పరుగెత్తుకుంటూ వెళ్ళి జనంలో కలిసిపోయాడు.

# 11

గోరుచుట్టుపై రోకటి పోటు

— సామెత

"పట్టుకోండి! పట్టుకోండి!" అని పలువురుపిల్లలు వీధి చివరనుండి కేకలుపెట్టారు. చెరెవిక్‌ను హఠాత్తుగా మంచి బలిష్టమయిన చేతులువచ్చి పట్టేసాయి.

"కట్టేయండి! గుర్రాన్ని దొంగిలించిన దొంగవాడే!"

"అరే! నన్ను కట్టేస్తున్నారెందుకు?"

"పైగా యెందుకని అడుగుతున్నావా? చెరెవిక్ గుర్రాన్ని యెందుకు దొంగిలించా?"

"మీ కేమయినా మతిపోయిందా? యెక్కడయినా యెవడిసొత్తు వాడు దొంగిలిస్తాడా చెప్పండి!"

"యీ టక్కులకేం, రోజూ వింటున్నవే! కాకపోతే యేదో దెయ్యం వెంటబడ్డవాడిలా అలా పరుగెత్తుతున్నా వెందుకు?"

"పరుగెత్తక యేంచేస్తానేం, దెయ్యంచొక్కా——"

"ఆ పప్పులేం యిక్కడవుడకవు. దెయ్యాలకథలు అల్లి జనాన్ని హడలుకొడదామని చూస్తున్నావా? నీకు బుద్ధి చెప్పిస్తాం చూడు!"

"పట్టుకోండి! పట్టుకోండి!" అని ఇంకో చివరనుంచి కేక వినిపించింది. "వాడే! వాడే!"

పలువురు పిల్లలు సిబుల్యాని చేతులు వెనుకకు తిప్పికట్టి తీసుకురావడం చెరెవిక్ చూసాడు. సిబుల్యా అవస్థ జాలి గొలుపుతోంది.

"వింతలు జరిగిపోతున్నాయి" అన్నాడు వారిలో ఒకడు. "యీ దగాకోరు చెప్పేమాటలు వినితీరాల్సిందే! మొహం చూస్తేనే పచ్చి దొంగ అని స్పష్టమవుతోంది. పిచ్చివాడిలా పరుగెత్తుతున్నా వెందుకు? అని అడిగాం. 'జేబులో చేయిపెట్టి తీస్తే పొడుం డబ్బా బదులు దెయ్యంగాడి చొక్కా వచ్చి యెర్రగా మండి లేచిపోయింది, భయంవేసి పరుగెత్తుతున్నాను' అని చెప్పాడు."

"ఓ – యిద్దరూ యిద్దరే. ఒకగాటిలో మేసేవాళ్ళే, యింకేం యిద్దర్నీ కలిపి కట్టేయండి!"

# 12

"నా తప్పేమిటో చెప్పరాదూ?
నన్నెందుకు చిత్రహింస పెడుతున్నావు?
నన్నెందుకు తిడుతున్నావు?
ఎందుకు? ఎందుకు?"
కన్నీరు కాలవకట్టింది!

–ఆర్టెమొవస్కీ–గులాక్ 'యజమాని–కుక్క' నుంచి.

"నువు నిజంగా యేదో దొంగిలించే వుంటావ్!" అన్నాడు చెరెవిక్ పూరిపాకలో సిబుల్యా పక్కన పడుకుని.

"నువ్వూ అదే అంటున్నావా, నేస్తం! యేదో చిన్నపుడు, ఐదోయేడు రాకముందు మా అమ్మ దాచిపెట్టిన పప్పులు తప్పితే మళ్ళీ యింతవరకు నేను దొంగతనం చేస్తే యెంతవోట్టు పడితే అంతవోట్టు. నేను అబద్ధమాడితే కాళ్ళూ చేతులూ పడిపోతాయనుకో!

"అలాఅయితే యీ చిక్కులు మనకెందుకు వచ్చిపడ్డట్టు? నీ విషయం మరేమంత బాధించదు. యెవడిసొత్తో అపహరించావని నీమీద ఫిర్యాదువచ్చిందిగాని నా గుర్రాన్ని నేనే అపహరించానని నిందవచ్చి పడిందే, యేంపాపంచేశానని నేస్తం! మనం పుట్టినపుడే దేవుడు నొష్టమీద దురదృష్టం రాసిపెట్టాడనుకుంటా!"

"దిక్కూ మొక్కూ లేని మన అవస్థ తీర్చేదెవరు ?"

ఇలా అనుకుంటూ స్నేహితులిద్దరూ వెక్కి వెక్కి ఏడవసాగారు.

"యేమిటిదంతా సొలోపీ!" అంటూ గ్రీట్స్కి లోపలికి చక్కా వచ్చాడు. "మిమ్మల్ని యిలా కట్టేసిందెవరు?"

"ఆ - గొలోవు పెంకో!" అని చెరెవిక్ సంతోషంతో కేక పెట్టాడు. "నీకు చెపుతున్నది యీ కుర్రవాడిని గురించే, నేస్తం! నీ తలకాయంత కూజా సునాయాసంగా ఖాళీ చేసేశాడు!"

"యింత ఘనుడయినవాడిని తోసిరాజన్నావేం ?"

"నీకు ద్రోహం చేసినందుకు భగవంతుడు నన్ను శిక్షించాడు" అన్నాడు చెరెవిక్, గ్రిట్స్కోను సంబోధిస్తూ. "క్షమించు. నీకోసం యేంచేయమంటే అదిచేస్తా. వొట్టు! యేంచేయను! ఆ దెయ్యపుముండ అడ్డువస్తుందాయెను!"

"అపకారికి అపకారం తలపెట్టే బాపతువాడిని కాను. సొలోపీ! కట్లు వూడదీయమంటే వూడదీస్తాను,"

ఇలా అని అక్కడి పిల్లలకు గ్రీట్స్కో కనుగీటాడు. అప్పటివరకు కాపలాకాస్తున్నవాళ్ళే కట్లు ఊడదీయడానికి ముందుకు ఉరికారు.

"అయితే నువ్వూ నీవంతు పనిచేయాలి. పెళ్ళి! పెళ్ళిలో నాట్యం చేసీ చేసీ కాళ్ళు నెప్పులుపుట్టిపోవాలి!"

"సరే, సరే!" అన్నాడు చెరెవిక్ చప్పట్లుకొడుతూ. "నా ముసిలిదాని పీడవదలి పోయినట్లనిపిస్తోంది. వేరే ఆలో చనెందుకు? మంచో చెడో పెళ్ళి యివాళ జరిగితీరాల్సిందే!"

"జ్ఞాపకం వుంచుకో సొలోపీ! గంటలో తిరిగివస్తాను. యిక యింటికి వెళ్ళు, అక్కడ నీ గుర్రాన్ని, గోధుమల్ని కొనే బేరగాళ్ళు సిద్ధంగా వుంటారు."

"యేమిటీ! గుర్రం కనిపించిందా?"

"ఆఁ–"

చెరెవిక్ సంతోషంతో మాటాడలేక పోయాడు. గ్రిట్స్కొ వంక తేరిపార జూస్తూ కొయ్యబొమ్మలా నిలబడ్డాడు.

"సరేగాని గ్రిట్స్కొ! వ్యవహారం నేను చెడగొట్ట లేదుగా!" అన్నాడు ఆ పొడుగాటి జిప్సీ హడావిడిగా వెడుతున్న ఆ కుర్రవాడితో. "యిక యెద్దులు నావి! అవునా?"

"ఆఁ – అవును! నీవే!"

# 13

భయపడకు, భయపడకు
భయపడకు నేస్తం!
తొగరు ముచ్చెలు తొడిగి
పగవారి పొగరణచు!
బ్రగ్గుమని మ్రోగు నీ
పాపోసు కిందపడి
పంచబంగాళమై
పారాలి పగవారు
—పెండ్లిపాట.

చిన్నారి గడ్డంమీద చేయి ఆనించుకుని పరధ్యానంగా కుటీరంలో కూర్చుంది, పరాస్కా. ఆమె చిట్టితలలో ఏవేవో కలలు పారాడజొచ్చాయి. మధ్యమధ్య ఎర్రటి పెదవులమీద మందహాసం నెలకొనేది. సంతోషంతో నల్లటి కనుబొమలు పైకి ఎగిరేవి. ఇంతలో ఏదో విషాదమేఘం అలుముకుని కనుబొమలు ముడుచుకునేవి.

"అతను చెప్పినట్టు జరగకపోతేనో?" అని తనలో తాను గుసగుసలు పోయింది, అనుమానభావంతో. "నన్ను పెళ్ళిచేసుకోనీయకపోతేనో! ఊహుఁ - అలా యెన్నటికీ జరగదు. మా మారటమ్మ తనకు యిష్టమొచ్చినట్లు చేస్తుంది.

నా యిష్టమొచ్చినట్లు నే నెందుకు చెయ్యకూడదు? నాకు మాత్రం పట్టుదల తక్కువా! అతనెంత అందగాడు! ఆ నల్లటి కళ్లు యెంతచిత్రంగా మెరిసిపోతాయి! 'పరాస్కా, ప్రియు రాలా!' అని యెంతసంతోషంతో అంటాడని! ఆ తెల్ల చొక్కా యెంతసొగసుగా అతనికి తగిపోయింది! నడుంపటకా యింకాస్త మెరుస్తూంటే బావుండును! కొత్తకుటీరంలో కాపరం స్థిరపడగానే పటకా అల్లిపెడతాను. అతన్నిగురించి ఆలోచించినకొద్దీ మనసు హాయిగావుంటుంది!" అనుకోసాగింది. సంతలో కొన్న ఎర్రకాగితపు చట్రపు అద్దం రవికజేబులో నుంచి తీసి సంతోషంతో చూసుకుంది. "యెక్కడో అక్కడ కలుసుకుంటే – వంగి దండంపెట్టకముందే మండిపడుతుంది! అవును. మామారుటమ్మ నన్ను చితకబాదింది. ఆపిల్ పూవులుపూసినా, సిందూరపుచెట్టు నీటిమీదికి వంగినా నేను మాత్రం మారుటమ్మకి తలవొగ్గను. అరె! మరచిపోయాను. మా మారుటమ్మది అయితేఅయింది, ముత్తయిదుటోపీ పెట్టుకుని యెలావుంటానో చూసుకుంటా!"

చేతిలో అద్దం పట్టుకుని లేచి, అద్దంమీద మొహంపెట్టి కిందపడిపోతానేమోననే భయంకొద్దీ కిందికి చూస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ గదిలో తిరగజొచ్చింది. కాని కిందకి చూసేసరికి నేలకు బదులు దూలాలమీదినుంచి కింద పడ్డ బల్లచెక్కలు, కుండలతోనిండిన అలమార్లు కనిపించాయి.

"చంటిపిల్లలా అడుగువేయడానికే భయపడిపోతున్నా నేవిటి చెప్మా?" అనుకుంది బిగ్గరగా నవ్వుతూ.

పాదాలతో నేలమీద తాళం వేయసాగింది. వేసిన కొద్దీ ధైర్యం వచ్చింది. నడుంమీద ఎడంచేయి పెట్టుకొని అద్దంలో చూసుకుంటూ, గజ్జెలు ఘల్లు మనిపిస్తూ తనకెంతో ఇష్టమయిన కింది పాటపాడుతూ నాట్యం చేయసాగింది.

అల్లీబిల్లీ తంగేడుతుప్పా
జల్లపెహూవులు నాపైనా
చక్కనికాటుక కన్నులదాన
సరసమురావే చినదానా !
అల్లీ బిల్లీ తంగేడుతుప్పా
కొల్లగ జల్లవె నాపైన
చక్కనికాటుక కన్నులదాన
అక్కునచేరవె చినదానా !

సరిగ్గా ఆ సమయానికి చెరెవిక్ గుమ్మంలోనుంచి లోపలకు తొంగిచూసాడు. అద్దంముందు కూతురు నాట్యం చేస్తూ ఉండడంచూసి నిర్ఘాంతపోయాడు. ఎన్నడూ లేనిది కూతురు ఇలా ఆడడం చూసి నవ్వుతూ చాలాసేపు నిలబడ్డాడు. ఆమె నాట్యంలో మునిగిపోయిందేమో ఏమీ గమనించలేదు. చిరపరిచితమయిన రాగంవగసవినిపించేసరికి అతని ఒళ్ళూ ఝల్లుమంది ముందడుగువేసి, నడుంమీద చేతులు పెట్టుకుని, వచ్చిన పని మరిచిపోయి, నాట్యం చేయసాగాడు. అతనినేస్తం సిబుల్యా బిగ్గరగా నవ్వడం చెవినిబడేసరికి ఇద్దరూ అదిరిపోయారు.

"బలే! బలే! యెవరినీ పిలవకుండా తండ్రీకూతుళ్ళిద్దరూ పెళ్ళి సంబరాలు మొదలుపెట్టారే. తొందరగా రండి, పెళ్ళి కొడుకు వచ్చేసాడు."

చివరమాటలకు పరాస్కా చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబారాయి. తండ్రికి తను వచ్చినపని జ్ఞాపకం వచ్చింది.

"సరేగాని, అమ్మాయి! తొందరగా తెములు. గుర్రాన్ని అమ్మినందుకు ఖర్వ్యాసంబరపడుతోంది." అన సాగాడు భయంతో చుట్టూచూస్తూ. "గాగరాలూ అప్పి యిపీ కొనడానికి పరిగెత్తింది. అది తిరిగొచ్చేలోపలే పూర్తి కావాలి."

పరాస్కా గుమ్మందాటిందో లేదో తెల్లచొక్కా యువకుడు వచ్చి కావలించుకున్నాడు. బయట ఇంకా జనం గుంపుగూడి ఆమెకోసం వేచిఉన్నారు.

"భగవంతుడు మిమ్ము రక్షించుగాక!" అని చెరెవిక్ ఆశీర్వదించాడు, వధూవరుల చేతులుకలుపుతూ. "దండలో పూలలాగా కలిసిమెలిసి జీవించండి."

ఆ సమయంలో జనంలో గందరగోళం బయలుదేరింది.

"నన్ను చంపినా యిదేంసాగనీను." అంటూ అరిచింది చెరెవిక్ సహధర్మచారిణి. జనం నవ్వుతూ ఆమెను వెనకకు తోసేసారు.

"యెందుకలా మండిపడతావ్?" అన్నాడు, చెరెవిక్ ప్రశాంతంగా, ఇద్దరు బలిష్ఠులైన జిప్సీలు ఆమె రెండుచేతులూ

గట్టిగా పట్టుకుని ఉండడంచూసి. “అయిందేవిటో అయిపో యింది. అన్నమాట తప్పడం పాడిగాదు.”

“ఉహుఁ- అలా జరగడానికి వీల్లేదు.” అని మళ్ళీ అరిచింది ఖ్రిస్త్యా. కాని ఎవరూ ఆమె మాటలు వినిపించుకోలేదు. ఆ వధూవరులచుట్టూ దంపతులుచేరి నాట్యంతో అభేద్యమయిన గోడకట్టారు.

ఫిడేలుమీద కమానుపడింది. పడీపడటంతో ఆ జన సందోహం ఒకేఒక మధురస్వరంగా వెల్లివిరిసింది. అలా వెల్లివిరియడం చూసినవారు విచిత్రమయిన, అనిర్వచనీయమైన భావాలకు లొంగితీరుతారు. ఎన్నడూ చిరునవ్వు నవ్వడమే ఎరగక చిరచిరలాడే మొహాలు మనుషులసైతం పాదాలతో తాళంవేస్తూ బుజాలు ఆడించసాగారు. ప్రతిఒక్కడూ గిరున తిరుగుతూ నాట్యం చేస్తున్నాడు. కాటికి కాళ్ళుచాచిన వృద్ధ స్త్రీలు నవ్వుతూ పాడుతూ నాట్యంచేసే యువజనులమధ్యగా దోవచేసుకోవడం చూస్తే ఇంకా విచిత్రమయిన, ఇంకా అనిర్వచనీయమయిన భావం ముంచెత్తుతుంది. ప్రాణంలేని యంత్రాన్ని నడిపే యంత్రవేత్తలాగా మద్యం ఆ వృద్ధస్త్రీలచేత మానవసహజమైన చేష్టలు చేయించింది. యువదంపతులకేసి దృష్టి పరపనయినా పరపకుండా, దేనినీ లక్ష్యపెట్టకుండా యవ్వనానందం సానుభూతీ కోల్పోయిన ఆ వృద్ధవనితలు మత్తెక్కిన తలలు ఊపుకుంటూ, ఆ జనసందోహంతో పాటు ఆనందిస్తూ నాట్యంచేసారు.

నవ్వులు, పాటలు కేరింతలు సన్నగిలజొచ్చాయి. షిడేలు రాగాలు క్రమక్రమంగా అస్పష్టమయి శూన్యంలో కలిసి పోయాయి. దూరసముద్రపు మూలుగులాగా దూరాన నాట్యంచేసే పాదాలరవళి ఇంకా వినిపిస్తోంది. కాస్సేపటికి అంతా మాటుమణిగిపోయింది.

ఈ విధంగానేగదూ కాలు నిలవని అతిథిలాగా మనోహరమయిన ఆనందం మనలను విడనాడి ఎగిరిపోయేది! ఒంటరి అంతిమరాగం ఆనందం ఒలికించాలని వ్యర్థప్రయత్నంచేస్తుంది. ప్రతిధ్వనిలో విషాదం, శూన్యంవిని నివ్వెరపోతుంది. స్వేచ్ఛాయవ్వన తుఫానులో మిత్రులయినవారు ఈ విశాలప్రపంచంలో పాతస్నేహితులను ఒంటరులను నిరాధారులను చేసి ఈ విధంగానే జారిపోతారుగదూ? దిగబడిపోయినవాడి దీనావస్థ ఏంచెప్పగలం? అతని హృదయం విషాదంతో బరువెక్కుతుంది. గత్యంతరం కనిపించదు!





# వనస్పతి పువ్వు

## బాండారి చెప్పిన యథార్థగాథ

చెప్పినకథే చెప్పడమంటే థోమా గ్రిగోర్యెవిచ్‌కి చచ్చేటంత తలనొప్పి. ఇది ఆతనిలోని విశిష్టగుణం. ఒక్కొక్కప్పుడు చెప్పినకథే మళ్ళీ చెప్పమని ఎవరో ఒకరు పట్టుబట్టి ఒప్పిస్తారు. కాని మళ్ళీచెప్పడంలో ఏదో కొత్తదనం కనిపిస్తుంది. నేనే గుర్తుపట్టలేనంతగా కథను మార్చేస్తాడు. వీరిలో ఒకడు – వాళ్ళని ఏమని పిలవాలో మాబోటి సామాన్యులకేం తెలుస్తుంది? కాని లేఖకులుమాత్రం కారు. వారు ప్రాధేయపడతారు, పట్టుకుపోతారు, రకరకాల విషయాలు దొంగిలిస్తారు. ఆ తరవాత నెలనెలకో, వారానికో చిన్నపిల్లల పాఠాలపుస్తకం

అంతటి చిన్నపుస్తకం ప్రకటిస్తారు. అలాంటి పెద్దమనిషి ఒకడు ఫోమా గ్రిగొర్యెవిచ్ దగ్గిరనించి ఈకథ చల్లగాలాగాడు. ఫోమామాత్రం ఈ విషయం మరిచేపోయాడు. నే నిదివరలో మీకు చెప్పానే, ఆబొటాణీ పచ్చరంగు కోటు పెద్దమనిషి, ఆతనికథ మీరు చదివిఉంటారనే నమ్ముతున్నాను. పొల్తావా నుంచి చిన్నపుస్తకం ఒకటి తీసుకువచ్చి మధ్యలో తెరిచిచూపించాడు. ఫోమాగ్రిగొర్యెవిచ్ ముక్కుమీద కళ్ళజోడు పెట్టుకోబోయాడుగాని బాగుచేయించడం మరిచేపోయానన్నే సంగతి జ్ఞాపకంవచ్చి పుస్తకం నా చేతికి ఇచ్చారు. నాకు చదవడం తెలుసు. చత్వారంలేదు. అందుకని బిగ్గరగా చదవడానికి పూనుకున్నాను. రెండుపేజీలు చదివానోలేదో ఫోమా గ్రిగొర్యెవిచ్ నాచేయి గట్టిగా పుచ్చుకున్నాడు.

"ఒక్కనిమిషం ఆగి, ముందు నువుచదివే దేవిటో చెప్పు?"

ఈ ప్రశ్న వేసేసరికి నేను కొద్దిగా హడలిపోయాను.

"యేవిటి నీ వుద్దేశం, ఫోమా గ్రిగొర్యెవిచ్! నీ కథే, నీ మాటలే చదువుతున్నా."

"అది నా కథ అని యెవరుచెప్పారు?"

"యింతకంటె నిదర్శనం యేం కావాలి? యిక్కడ అచ్చుగుద్దివుంది. 'ఫలానా భాండారిచేత చెప్పబడిన'—

"వాడిని తగిలేసిరి! వట్టి అబద్ధాలకోరు వెధవ! నే నలాగేనా చెప్పింది? తలసీలలు వదులయితే యెవరేం చేయగలరు? వినండి మళ్ళీ యిపుడుచెబుతాను."

మేజాబల్ల దగ్గరికి చేరాం. ఆయన కథ ప్రారంభించాడు:

మా తాత (ఆయన ఆత్మకు శాంతిగలుగుగాక! పర లోకంలో పుష్టుగా గోధుమరొట్టెలు, పోస్తు రొట్టెలు లభించు గాక!) కథలు చెప్పడంలో అందెవేసిన చేయి. చెప్పడం ప్రారంభిస్తే రోజురోజల్లా కదలకుండా వింటూ కూర్చుంటాం. మూడు రోజులపాటు తిండితిననివాడిలా హీనస్వరంతో కథ అల్లి చెపుతూ శ్రోతలను టోపీపెట్టుకుని లేచి చక్కాపోయేటట్లు చేసే నేటి వదరుబోతులవంటివాడు కాదు మా తాతయ్య. నాకు బాగా జ్ఞాపకం - మా అమ్మ ఇంకా బతికేవుంది. శీతాకాలంలో ఒకనాటి సాయంకాలం మంచు మా గుడిసె కిటికీని కప్పేసింది. మా అమ్మ పంటికోలముంచు వేసుకుని దారం లాగుతూ, కాలితో ఉయ్యాలఊపుతూ, పాటపాడింది. ఆ పాట ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటోంది. భయపడిపోయినదానిలాగా దీపం మినుకుమినుకుమంటూ గుడిసెలో వెలుగుతోంది. పంటి కోల ఝుమ్మంటోంది. మా తాత శత వృద్ధేమో స్టోవ్ మీంది నుంచి సరిగాదిగి అయిదేళ్ళయింది. పిల్లలమంతా గుమిగూడి తాతయ్య చెప్పేకథవినసాగాం. పూర్వం ఎన్నడో జరిగిన అద్భుతదృశ్యాలనుగురించిన కథలు, జపరోజియే కోసక్కుల దాడులనుగురించినకథలు, పోలండువారి కథలు, పొడ్కోవా, పోల్తోరా - వొజక్కీ, సగాయిడచనీ సాహసకృత్యాలకథలు మాకు అంతగా నచ్చలేదు. చాలాకాలంక్రితం జరిగిన భయంకరగాథలంటే చెవికోసుకునేవాళ్ళం. ఆ కథలు వింటుంటే మా ఒళ్ళు ఝల్లుమనేది. వణుకుపుట్టేది. ఒక్కొక్కప్పుడు ఎంత

భయంవేసేదంటే, చీకటిపడగానే ప్రతిదీ చిత్రంగా, భయంకరంగా గోచరించేది. ఒకొక్కప్పుడు రాత్రిపూట ఎందుకో ఒకందుకు బయటికి అడుగుపెడితే పరలోకాన్నుంచి ఎవడో వచ్చి మూ పక్క ఆక్రమించినట్టు అనిపించేది. చుట్టచుట్టి తలగడగా పెట్టుకున్న చొక్కాను చూసి దెయ్యంముడుచుకుని పడుకుందని భ్రమపడేవాడిని. ఏ వొట్టుపడితే ఆ వొట్టు! కాని మా తాతయ్యకథలలో విశేషమేమంటే, జీవితంలో ఎన్నడూ అబద్ధం చెప్పలేదు. ఆయన చెప్పిందంతా నిజంగా జరిగిందే.

ఆయన చెప్పిన అద్భుతమయిన కథలలో ఒకటి మీ కిప్పుడు చెపుతా వినండి. ప్రార్థనా గ్రంథం చేతికి ఇస్తే ఒక అక్షరమయినా చదవలేకపోయినా న్యాయస్థానాలలో ఇంత ఎదోగిలుకుతూ, ఇప్పుడు అచ్చయే చెత్త చదువుతూ, ఇతర్లను వెక్కిరించే కుశాగ్రబుద్ధులు ఈ రోజులలో చాలామంది ఉన్నారని నాకు తెలుసు. ఏంచెప్పినా వాళ్లు ఎగతాళిచేస్తూనేఉంటారు. అటువంటి అపనమ్మకం ప్రపంచమంతటా వ్యాపిస్తోంది. నే చెపితే నమ్మరుగాని - ఒకరోజున ఖర్మంకాలి నేను మంత్రగత్తెల సంగతి నోరుజారాను. నామాట నమ్మందే! పుట్టి నప్పటినుంచీ చూస్తున్నాను. నేను పొడుంపట్టు పీల్చినంత సులువుగా ఫాదరీముందు చేసిన పాపాలు ఒప్పేసుకునే సమయంలో కూడా అబద్ధాలాడే పాషండులు అనేకమంది ఉన్నారు. అటువంటి వాళ్ళుకూడా మంత్రగత్తెల బారినుంచి తప్పించుకునేందుకు శిలవ గుర్తువేస్తారు. కాని వాళ్ళకే గనక కలలో - ఏమిటో చెప్పనుబాబూ! - ఏమయిపోతారో?

చాలా సంవత్సరాలక్రితం సుమారు వంద సంవత్సరాలనుకోండి, మన ఊరు ఎవరూ ఎరగరని మాతాత చెప్పాడు. అప్పుడు ఇది చిన్నపల్లె. పల్లెల్లోకల్లా పల్లె. పొలాలలో అక్కడక్కడా ఓ డజనుగుడిసెలు ఉండేవి. ఒకదానికీ గచ్చుగానీ, సరయిన కప్పుగాని ఉండేదికాదు. కోరడులులేవు. పశువులను కట్టేయడానికిగాని బళ్ళను పెట్టుకోడానికిగాని సరయినకొట్టాలు లేవు. భాగ్యవంతులికే అవన్నీని. మాబోటి బీదవాళ్ళస్థితి చూడాలేగాని చెపితే తెలియదు. నేలలో బొరియ తవ్వే వాళ్ళం. అదే మా గుడిసె! పొగనుబట్టి అక్కడ మనుషులు నివసిస్తున్నారని తెలుసుకోవలసిందే! అలా ఎందుకు కాలం వెళ్ళబుచ్చుతున్నారని మీరడగవచ్చు. కారణం బీదరికంకాదు. ఆరోజుల్లో ప్రతిఒక్కడూ కోసక్కే. దేశదేశాల నుంచీ మంచిమంచి వస్తువులు చాలా ఇంటికి పట్టుకువచ్చే వాళ్ళు. మరి బొరియల్లో నివసించడం ఎందుకంటే మంచిగుడిసె వేసుకుని లాభంలేదు గనుక. ఆరోజుల్లో రకరకాల మనుషులు - క్రిమియన్లు, పోలండువాళ్ళు, ఒకొక్కప్పుడు మన వాళ్ళే దండుగా వచ్చి ఉన్నదంతా గోఘ్యాడగొట్టి లాక్కునే వారు.ఒకటేమిటి, ఎవేవో జరిగిపోతూవుండేవి.

ఆ పల్లెలో తరుచు ఒక మనిషి, మనిషేమిటి, ఒక దెయ్యం మనిషి ఆకారంలోకనిపిస్తూండేది. ఎందుకువస్తున్నాడో ఎక్కడినుంచివస్తున్నాడో ఎవరికీ తెలీదు. తాగి తందనాలాడి మాయమయి చక్కాబోయేవాడు. మరి ఆచూకి తెలిసేది కాదు. మళ్ళీ హఠాత్తుగా ఎక్కడినుంచో

ఊడిపడి వీధులవెంట తెగ తిరిగేవాడు. కోసక్ ఎవడన్నా ఒంటరిగా కనిపిస్తేచాలు వాడితో చేరేవాడు. ఇక ఒకటే నవ్వులు, సంగీతాలు! డబ్బుకు రెక్కలువచ్చేవి. వోడ్కా మంచి నీళ్ళలాగా ప్రవహించేది. ఒకొక్కప్పుడు వాడి దృష్టి ఆడ పిల్లలమీద పడేది. వాళ్ళకి కుప్పతిప్పలుగా రిబ్బన్లు, లోలా కులు, హారాలు బహుమతులు ఇచ్చేవాడు. వాటన్నిటినీ ఏం చేయాలో ఆ ఆడపిల్లలకి అర్థమయ్యేదికాదు. అవి దెయ్యాని వేమో ఎవరికి తెలుసు? అందుకని బాగా ఆలోచించిగాని వాటిని పుచ్చుకునేవారుగారు. మా తాతకి ఒక మేనత్త ఉండేది. ఆమె ఒపష్నాయా రోడ్డులో సారా దుకాణం పెట్టింది. బసవ్రుక్ అది ఆదెయ్యం పేరు లెండి, వాడు తప్ప తాగడానికి అక్కడికి వెళుతుండేవాడు. ఏమయినాగానీ వాడి దగ్గరమాత్రం ఆమె బహుమతీ పుచ్చుకునేదికాదు. కాని అతను బహుమతులు ఇస్తానంటే నిరాకరించడంఎలా? బొద్దు కనుబొమలు ముడిచి చూస్తుంటే ఎంతటివాడయినా హడలి పోయి పిక్కబలం చూపేవాడు. ఖర్మంచాలక ఏ ఆడకూతు రయినా బహుమానం పుచ్చుకుంటే ఆరాత్రి బాడువలోనుంచి వాడి ప్రాణస్నేహితుడు తలమీద కొమ్ములతో లేచివచ్చి ఆమెముందు ప్రత్యక్షమయి మెళ్ళో హారంవేసుకుని ఉంటే మెడ నులిమేయాలని చూసేవాడు. వేలికి ఉంగరంవుంటే వేలు కొరికేవాడు. రిబ్బను పెట్టుకునివుంటే జుట్టు గుంజేవాడు. వాడి బహుమతులు మండిపోను! అంతేకాదు, వాటిని వది లించుకుందామన్నా వదిలేవికావు. నీళ్ళల్లో పారేస్తే ఆ ముద

నష్టపు హారమో ఉంగరమో పైకితేలి సరాసరివచ్చి చేతిలో పడేది!

ఊళ్ళో పాంటలేచర్చి అని ఒకచర్చి ఉండేది. అందులో అఫనసీ అనే మహానుభావుడు ఫాదరీ. ఈస్టరు ఆదివారంనాడు కూడా బస్ట్రుక్ చర్చికి రాకపోవడం కనిపెట్టాడు. నాలుగు చివాట్లుపెట్టి పాపపరిహారార్థం కాయకష్టం చేయిస్తానని బెదిరించి చూసాడు. కాని అదేం లాభంలేకపోయింది. శృంగభంగమయింది. "యిలా వినండి స్వామీ" అని అరిచాడు బస్ట్రుక్ జవాబుగా. "మీ పనేమిటో మీరు చూసుకోండి. అంతేగాని యితర్ల వ్యవహారాలలో జోక్యం చేసుకోకండి. చేసుకున్నారా, మీ మేకపోతు గొంతు నులిమేస్తాను!" ఆ పాపిష్టివెధవని ఏంచేయాలి? బస్ట్రుక్‌తో సంబంధంఉన్న వాడినల్లా కాథలిక్ అనీ చర్చికీ మానవజాతికి శత్రువనీ అఫనసీ ప్రకటించాడు.

ఆ ఊళ్ళోనే కోర్జ్ అనే కోసక్‌దగ్గర ఒక పాలేరుఉండేవాడు. అతడిని 'దిక్కులేని పెట్రో' అని పిలుస్తుండేవారు. అతని తలిదండ్రులెవరో ఎవరికీ జ్ఞాపకంలేదు. పెట్రో ఏడాది పిల్లవాడయిఉండగా తలిదండ్రులు ప్లేగువచ్చి చనిపోయారని చర్చివార్డెను చెపుతూండేవాడు. కాని మాతాతగారి మేనత్తమాత్రం అతని మాటలు వినిపించుకోకుండా ఆ బంధుత్వం ఈబంధుత్వం అంటగట్టేది. అయినా పెట్రో వాళ్ళనేమీ లక్ష్యపెట్టేవాడుకాదు. పెట్రో తండ్రి ఇప్పటికీ జపరోజియేలో ఉన్నాడనీ, టర్కీవాళ్ళు ఖైదీగా పట్టుకుపోయి నానాహింసలూ

పెట్టారనీ, కొజ్జావేషం వేసుకొని చిత్రంగా తప్పించుకున్నాడనీ చెపుతూండేది. నల్లటికనుబొమల ఆడపిల్లలు, యువకులు అతని బంధువులను గురించి పట్టించుకునేవారుగాదు. కొత్తఅంగరఖా వేసుకొని, ఊదాకుచ్చు నల్లటోపీ తలమీాదా, ఎర్రటిపటకా నడుముకూ పెట్టుకొని, టర్కీ కత్తి పార్శ్వాన వేలాడగట్టుకుని, ఒకచేతితో కొరడా రెండో చేతితో చక్కటి పైపూ పట్టుకుంటే ఊళ్ళోవారెవళ్లూ అతనితో దీటురారని అనేవారు. కాని పాపం! పెట్రోకి ఒకేఒక చొక్కా ఉండేది. దానికి చచ్చినన్ని చిల్లులు! అయితే అసలు విషయం అదికాదు. ముసిలికోర్జ్‌కి ఒక కూతురుఉంది. అంత చక్కని చుక్కను మీారెన్నడూ చూసి ఉండరు. ఆడది ఇంకో ఆడదాని అందం చచ్చినా మెచ్చుకోదని మీాకు తెలుసుగా! అయినా మా తాతగారి మేనత్త అనేది-'ఆ పిల్ల చెంపలు బొద్దుగా నవనవలాడుతూంటాయి. మంచులో తడిసి, ఆకులు విప్పుకుని లేత యెండలో సొగసుచేకూర్చుకునే లేతగులాబిరంగు పొస్తు చెట్టులా తళతళలాడతాయి. ఈ రోజుల్లో శిలువలు, మెడలో వేలాడగట్టుకోవడానికి మన ఆడపిల్లలు వీధివర్తకుల దగ్గర కొనే నల్లదారాలలాగా కనుబొమలు నల్లగా విలువంపు తిరిగి ఆమె కళ్ళనే తేరిపార జూస్తూన్నట్టుంటాయి. నోరు - యువకులంతా మహాకాంక్షతో తేరిపారజూసే నోరు కోకిల గానం విని పించడానికి సృష్టించబడిందా అన్నట్టుంటుంది. జుట్టు కాకి రెక్కలాగా నల్లగా, పట్టులాగా మెత్తగావుండి బంగారుబుట్టాలు వేసిన రెవికమీాద రింగులు రింగులుగా పడుతుంది. (ఆరోజుల్లో

మన ఆడపిల్లలు రిబ్బన్లతో జడ అల్లుకునేవారు కాదు)' నా నెత్తి మీదిజుట్టు తెల్లబడుతున్నా, ముసిల్దిఉన్నా నేనయితే అక్కడి కక్కడ ఆ పిల్లని ముద్దెట్టుకునేవాడినే! మా ముసిల్దిచూసారూ ఉండగూడనపుడు కూడా నన్ను వదలకుండా అంటిపెట్టుకుని ఉంటుంది. సరే, దీనికేంగాని, పిల్లవాడు, పిల్ల ఒకచోటే నివసిస్తూంటే ఏం జరుగుతుందో అందరికీ తెలిసిందేగా! ఛళ్ళన తెల్లవారేసరికి పెట్రోతో పిడోర్కా కలిసి మాట్లాడినచోట ఎర్రబూట్ల అడుగు గుర్తులు కనిపించేవి. కోర్జ్‌కి ఈ వ్యవహారం తెలిసేదికాదుగాని ఒకరోజున పెట్రో ముందుగదిలో నాలుగు వైపులా చూడకుండా ఆ కోసక్ పిల్ల పెదవులమీద వెచ్చటి ముద్దు కురిపించాడు. ఇదంతా ఆ మొగదయ్యంపనే ననుకోండి! ఆ దెయ్యమే ఇంకా ఏంజేసిందనుకున్నారు, సరిగ్గా ఆ సమయానికి కోర్జ్ తలుపుతీసి తొంగిచూసేటట్టు చేసింది. కోర్జ్ నిర్ఘాంతపోయి, గుమ్మం పట్టుకుని, నోరు తెరచుకుని నిల్చున్నాడు. ఆ వెధవముద్దు అతనికి దిగ్భ్రాంతి కలిగించింది. మా రోజుల్లో తుపాకిమందు లేకపోవడంవల్ల దెయ్యాలని భయపెట్టడానికి గోడమీద రోకలితో అదేపనిగా కొట్టేవారు. ఆ మోత కంటె ఆ ముద్దు ఎక్కువ గట్టిగా ఉందని అతనికి అనిపించింది.

ఆదిగ్భ్రాంతి నుంచి కోలుకొని గోడమీదనుంచి కొరడా తీసి పెట్రో వీపుమీద ఆడించబోయాడు గాని ఇంతలో హఠాత్తుగా పిడోర్కా తమ్ముడు ఇవాన్, ఆరేళ్ళవాడు పరుగెత్తుకుంటూవచ్చి భయంతో తండ్రికాళ్ళుచుట్టేసి, "పెట్రోని కొట్టొద్దు నాన్నా!" అని కేకపెట్టాడు.

ఇంక చేసే దేముంది? తండ్రిమనసు రాయీ రప్పానా! కొరడా గోడకుతగిలించి మెల్లగా పెట్రోను బయటికి తీసుకు వెళ్ళాడు. "యీ నా కుటీరంలోకి అడుగుపెట్టినా, చివరికి కిటికీ కింద కనిపించినా నీ మీసాలూ, జుట్టూ గొరిగించి మరీపంపు తాను. అలా చేయకపోతే నా పేరు ఒరెంటీ కోర్జ్ కాదనుకో!"

ఇలా అని ముచ్చెలగుంటమీద తేలికగా ఒక్క దెబ్బ కొట్టాడు. పెట్రో ముందూ వెనకా చూడకుండా ఒకటే పరు గుచ్చుకున్నాడు. పాపం! ముద్దులవల్ల వచ్చిన లాభం ఇదీ!

మన గువ్వల జంటకి విచారంపట్టుకుంది. ఇంతలో ఒక కొత్తమనిషి అస్తమానమూ కోర్జ్ ఇంట్లో కనిపిస్తూన్నాడని కింవదంతి ఊరంతా వ్యాపించింది. ఆ కొత్తమనిషి పోలండు జరీదుస్తులు ధరించేవాడు. మీసాలుండేవి. కత్తి, తట్టముళ్ళు, చర్చిపనిమనిషి తారాస్ రోజూ మోగించే గంటలా జేబులూ గలగలలాడేవి. సరే. అందమయిన అమ్మాయితండ్రిని చూడడానికి ఎవరయినా ఎందుకు వెళతారో మీకు తెలుసు. అందుకని ఒకరోజున పిడోర్కా కన్నీళ్ళుపెట్టుకుని, చిట్టితమ్ముడు ఇవాన్ని ఎత్తుకుని, "ఇవాన్! బాణంలాగా పరుగెత్తుకుంటూ వెళ్ళి పెట్రోకి అంతా చెప్పేసెయ్. 'నీ కళ్ళంటే నాకు అపరి మితమయిన ప్రేమ. నీ అందమయిన మొహం ముద్దెట్టుకోవాలని వుంది. కాని విధిరాత వేరుగావుంది. కన్నీళ్ళతో ఎన్నోతువాళ్ళు తడిసిపోయాయి. నా మనసు విచారంతో మగ్గిపోతోంది. నా తండ్రే నాకు శత్రువయినాడు. ఆ వెధవ పోలండువాడిని పెళ్ళి చేసుకోమని బలవంతపెడుతున్నాడు. పెళ్ళిసన్నాహం చేస్తు

న్నాను. పెళ్ళికి బాజాబజంత్రీలను పెట్టను. సన్నాయి బదులు ఫాదరీ మంత్రాలు చదువుతాడు. పెళ్ళికొడుకుతో సన్నా నాట్యం చేయనీను. తీసుకు చక్కాబోతాను. యిక నా కాపరం వల్లకాట్లో. అక్కడ పొగగొట్టం బదులు శిలువ నెలకొం టుంది!' అని చెప్పా నా బంగారు తండ్రీ!"

రాతి బొమ్మలా చలనంలేకుండా నిలబడి ఆ అమా యిక పిల్లవాడినోటిమీదుగా పెట్రో ఈమాటలువిన్నాడు:

"యిక నేను దురదృష్ట జాతకుడిని. క్రిమియాకో టర్కీకో వెళ్ళి యుద్ధంలో యింత బంగారం గెల్చుకుని నీ దగ్గిరికి తిరిగి వద్దామని ఆలోచిస్తున్నాను. సౌందర్య దేవతా! కాని అలా జరిగే గీతలేదు. దిష్టికళ్ళు మనమీద పడ్డాయి. ప్రియతమా! నాకూ వివాహం జరుగుతుంది. కాని నా పెళ్ళికి పురోహితుడు వుండడు. పురోహితుడి బదులు మాలకాకి అరుస్తూమంత్రాలు చదువుతుంది. ఆరుబయటే నా కాపురస్థలం. కారుమబ్బులే ఆచ్ఛాదన. నాకళ్ళు ఏ రాబందో పొడుచుకుతింటుంది. వానకు నా కోసరకే బొమికలు కొట్టుకుపోతాయి. సుడిగాలి వాటిని యెండేస్తుంది. అరే, యేమి టంటున్నాను. యీ నిష్ఠూరం యెవరిమీద? యెవరితో చెప్పుకుంటున్నాను? యిదంతా భగవ దేచ్ఛలాగా కనిపిస్తుంది. నేను నాశనమయి పోవాలని రాసి పెట్టివుంటే సరే, నాశనమయిపోతాను" ఇలా అంటూ సరా సరి సారాదుకాణం దోవపట్టాడు.

పెట్రో సారాదుకాణానికి రావడం అందులోనూ ప్రార్థనలకు వెళ్ళే సమయంలో రావడంచూసి మా తాతగారి

మేనత్త ఆశ్చర్యపోయింది. అరముంతెడు వోడ్కా ఇమ్మని అడిగేసరికి నిర్ఘాంతపోయి గుడ్లప్పగించి చూసింది. తప్పతాగి మనశ్శాంతి పొందాలని చూసాడు గాని పాపం! లాభంలేక పోయింది. దురదగొండి ఆకులాగా వోడ్కా అతని నాలుకను బాధించింది. గాడిదగడప ఆకుకంటె చేదు అనిపించింది. ముంత నేలకేసి కొట్టాడు.

"యిక విచారపడకు, కోసక్!" అని ఒక గొంతు బుయ్యిమంది.

వెనకకు తిరిగి చూసాడు. బసవ్రుక్! అరే! ముళ్ళ జుట్టు! ఎద్దు కన్నులు! అబ్బ చూడలేం!

"నీకు కావల్సిందేవిఁటో నాకు తెల్సు. యిదే!" దెయ్యపునవ్వునవ్వుతూ నడుంపటకాకు వేలాడుతున్న తోలు సంచి గలగలలాడించాడు.

"ఓ - యెలా తళతళా మెరుస్తున్నాయో చూడు!" అని అరిచాడు. బసవ్రుక్ అరచేతిలో, బంగారునాణేలు పోసు కుంటూ. "యెలాగు గల గల లాడుతున్నాయో విను, యిటు వంటివి ఓ లక్ష యివ్వగలను. కాని ఒకపనిమాత్రం చెయ్యాలి."

"దెయ్యం!" అని అరిచాడు పెట్రో "చెప్పు, యేం చెయ్యమన్నా చేస్తాను."

ఇద్దరూ ఒప్పందానికి వచ్చారు.

"చూడు, పెట్రో, సరయిన సమయానికే వచ్చావ్ - రేపు సెయింట్ జాన్ పుట్టినరోజు. సంవత్సరంలో యీ ఒక్క

రాత్రే వనస్పతి పూస్తుంది. యీ అవకాశం జారవిడవకు! నీ కోసం అర్ధరాత్రివేళ యెలుగుకనుమలో కాచుకునివుంటాను."

ఇంటి యజమానురాలు గింజలు ఎపుడు తెచ్చి వేస్తుందా అని తొందరపడే కోడిపిల్ల లాగా సాయంత్రం ఎపుడు అవుతుందా అని పెట్రో తొందరపడసాగాడు. చెట్టునీడ పెరుగుతోందా లేదా, అస్తమయసూర్యుడు ఎరుపు కక్కుతున్నాడా లేదా, అని ఒకటే చూడసాగాడు. గంటలకు గంటలు గడచిన కొద్దీ ఆదుర్దా ఎక్కువయింది. అబ్బ! కాలం ఎంతమెల్లగా నడుస్తోంది! అసలు పగటికి అంతువున్నట్లే కనిపించడం లేదు. సూర్యాస్తమానం అయింది. ఆకాశంలో ఒకవైపునే ఎర్రచార కనిపించింది. అదీ మాసిపోతోంది. పొలాలలో చలిఎక్కువయింది. వెలుతురు క్రమక్రమంగా మందమయి చీకటిపడింది. అబ్బ! ఎలాగయితేనేం చీకటిపడింది! పెట్రో గుండె టకటకా కొట్టుకుంటూ బయటికి దూకేటట్లుంది. బయలుదేరి కారడవి గుండా 'ఎలుగుకనుమ' అని పిలవబడే ఒక లోతు బొంద చేరుకున్నాడు. బసవ్రుక్ అప్పటికేవచ్చి సిద్ధంగాఉన్నాడు. అర చేయికూడా కనిపించనంతటి చీకటి! ఇద్దరూ చేయిచేయికలుపుకుని బాడవమీదుగా నడకసాగించారు. ముళ్ళు తగులుకున్నా, అడుగడుగుకు పడుతూ లేవవలసివచ్చినా వెనుదీయకుండా వెళ్ళీవెళ్ళీ ఒక సమప్రదేశం చేరుకున్నారు. పెట్రో ఆగి నలుమూలలా పరికించాడు. అక్కడికి అతనెపుడూ రాలేదు. బసవ్రుక్ కూడా ఆగాడు.

"అవిగో కనిపిస్తున్నాయే ఆ మూడు గుట్టలమీదా రకరకాలపూలు పూస్తుంటాయి. వాటిని కోయకు. వనస్పతి పూయగానే కోసి వెనక్కి తిరిగి చూడకుండా చక్కా రా!"

పెట్రో ఒక విషయం ప్రశ్నిద్దామనుకున్నాడు. కాని అరె! ఇంతలో బస్రుక్ మాయమయిపోయాడు. పెట్రో మూడు గుట్టలతగ్గిరికి చేరుకున్నాడు. ఎక్కడబడితే అక్కడ నల్లగా కలుపు మొక్కలే! పిచ్చిగా పెరిగాయేమో ఇక ఏదీ బతకలేదు. కాని ఇంతలో తళుక్కుమని మెరిసింది. ఎన్నడూ చూడని చిత్ర విచిత్రపుపూలు కనిపించాయి. వాటిలో కూడా వనస్పతి పూలరేకులు! పెట్రో దిగ్భ్రమచెంది సంశయిస్తూ నడుంమీద చేతులు పెట్టుకుని నిలబడ్డాడు.

"యిందులో కొత్తేవుంది? రోజుకి వందసార్లు యీ చెత్తపూలు కనిపిస్తూనే వుంటాయి. మరి యిందులో చిత్రమేవుంది? యీ దయ్యం నన్ను యెగతాళి పట్టించాలని చూసినట్లుంది!"

ఇంతలో హఠాత్తుగా చిన్న పువ్వు ఒకటి ప్రాణం ఉన్నదానిలా గిరగిరా తిరుగుతూ కదలాడజొచ్చింది. నిజానికి చిత్రంగానేఉంది. కదులుతూ క్రమక్రమంగా పెద్దదయి కాలే బొగ్గులాగా ఎర్రబడింది. హఠాత్తుగా ఒక నక్షత్రం నేలరాలింది. టప్ మని చప్పుడయింది. ఆ పువ్వు వికసించి చుట్టుపక్కల పువ్వులకు జ్వాలలాగా కాంతిని ప్రసాదించింది.

"యిదే సమయం" అనుకుని పెట్రో చేయిచాచాడు. హఠాత్తుగా వెనుకనుంచి వందలకొద్దీ మోటుచేతులు ఆ పువ్వు

వైపుకు చాచుకోవడంచూసాడు. ఆతని వెనుకఏదో ముందుకూ వెనకకూ కదలాడసాగింది. కళ్ళుమూసుకుని తొడిమ పుచ్చుకుని గుంజాడు. పువ్వు చేతిలోకి వచ్చింది. సద్దు అణగిపోయింది. బస్ర్రుక్ శవంలాగా నీలవర్ణంతాల్చి బోదిమీద కూర్చుని కనిపించాడు వేలుకూడా ఆడించలేదు. దృష్టి దేనిమీదనో లగ్నమయిఉంది. నోరు సగంతెరుచుకుని ఉంది. ఎలాంటి శబ్దం దానిలోనుంచి రావడంలేదు. చుట్టుపక్కల కూడా ఎక్కడా కదిలిక లేదు. మహా భయంకరంగావుంది. ఎలాగయితేనేం చివరికి ఈల వినిపించింది. పెట్రో నిలువెల్లా వణికిపోయాడు. గడ్డి గొణుగుతున్నట్లు, వెండిగంటలంత సున్నితంగా పువ్వులు ఒకదానితో ఒకటి మాట్లాడుకుంటున్నట్లు అనిపించింది. చెట్లు కోపంతో ప్రతిధ్వనించాయి. బస్ర్రుక్ మొహం హఠాత్తుగా వికసించింది. కళ్ళు తళతళలాడాయి. "వచ్చావా, ముసిలిముండా!" అని గద్దించాడు. "చూడు, పెట్రో ఒక సౌందర్యవతి నీకు కనిపిస్తుంది. ఆమె చెప్పినట్లల్లా చేయలేకపోతే వాతపూరిపోతావు."

ఇలా చెప్పి వంకరకర్రతో ఒక ముళ్ళపొదను రెండుగా వేరు పరిచాడు. ఒక చిన్నగుడిసె - కట్టు కథలలోచెప్పే మంత్రగత్తె గుడిసె కనిపించింది. బస్ర్రుక్ పిడికిలితో దానిమీద కొట్టాడు. గోడ పడిపోయింది. నల్లటి పెద్దకుక్క వారికేసి పరుగెత్తుకుంటూ వచ్చి, పిల్లిగా మారి కీచుమని అరుస్తూ వారిగుడ్లు పీకడానికి పైనబడింది.

"కోపగించుకోకు కోపగించుకోకు, ముసిలిముండా!" అన్నాడు బస్రవుక్ మాటలకు బూతులు జోడించి. పిల్లి నిలబడ్డచోట ఒక ముసిలిది కనిపించింది. ఉడికిన ఆపిలు పండు లాగా ఒళ్ళంతా ముడతలే. నడుం వంగిపోయింది. ముక్కు, గడ్డం అడకత్తెరలా కలుసుకుపోయాయి.

"బలే అందగత్తె!" అనుకుని పెట్రో వణికిపోయాడు.

ఆ మంత్రగత్తె పెట్రో చేతిలోని పువ్వును గుంజుకుని దానిమీద మంత్రించుతూ, ఒక రకమయిన నీళ్ళు జల్లుతూ చాలాసేపు గడిపింది. ఆమెనోటిలోనుంచి నిప్పురవ్వలు బయలు దేరాయి. పెదవులమీద నురుగుబొట్లు నిలిచాయి. "విసిరి పారేసెయ్" అంది ఆ పువ్వును తిరిగి యిచ్చివేస్తూ. పెట్రో విసిరివేశాడు. కాని చిత్రం! పువ్వు వెంటనే కిందపడలేదు. అంధకారంలో అగ్నిగోళంలాగా చాలాసేపు నిలచింది. పడవ లాగా గాలిలో తేలి ఆడింది. చివరకు మెల్లగా కిందకు దిగి ఎక్కడో దూరాన పడి పోస్తుగింజంత నక్షత్రంలా కాన వచ్చింది. "యిదిగో, యిక్కడ" అని ఆ ముసిలిది బొంగురు గొంతుతో ఊదినట్లు చెప్పింది. పార చేతికి అందిస్తూ బస్రవుక్ "పెట్రో! యిక్కడ తవ్వు. నువూ, కోర్జకూడా యెన్నడూ కలలోనయినా చూడనంత బంగారం దొరుకుతుంది!" అన్నాడు.

చేతులుమీద ఉమ్మివేసుకుని పెట్రో పారతీసుకుని, వంగి తవ్వసాగాడు. ఒకటి...రెండు...మూడు... నాలుగు పారలమట్టి తవ్విపోసాడు. పారకు ఏదో గట్టిగా తగిలి ఖంగు

మంది. ఇక పార దిగలేదు. ఇనపరేకులు చుట్టిన చిన్న పెట్టె ఆతని కళ్ళకు స్పష్టంగా గోచరించింది. పెట్టెను పట్టుకుని పైకి ఎత్తాలని యత్నించాడుగాని అది క్రమేపీ నేలలోకి లోతుగా చొచ్చుకుపోయింది. వెనకగా పాము బుసలాంటి నవ్వు విని పించింది.

"నరరక్తం వారబోస్తేనేగాని బంగారం కనిపించదు!" అంటూ ఆ మంత్రగత్తె తెల్ల దుప్పటిలో చుట్టి ఆరేళ్ళ పిల్లవాడిని అందించింది. తల నరకమని సంజ్ఞ జేసింది. పెట్రో నిర్ఘాంత పోయాడు. ఇదేం చిన్నవిషయమా? అకారణంగా ఒక మనిషిని, అందులోనూ చిన్న పిల్లవాడిని ఖూనీ చేయడమా? కోపంతో పిల్లవాడి దుప్పటి లాగేశాడు. అరే! ఎవరు? ఇవాన్! పాపం, ఆ పిల్లవాడు చేతులుకట్టుకుని తలవంచుకుని ఎదురుగా నిలబడ్డాడు. కత్తి చేపట్టి పిచ్చెత్తినవాడిలా పెట్రో ఆ మంత్రగత్తెమీదికి దూకి నరకడానికి చేయి ఎత్తాడు.

"ఆ అమ్మాయికోసం నువేంమాటయిచ్చావో మరిచే పోయావా?" అంటూ గర్జించాడు బసవ్రుక్. అతనిమాటలు తుపాకిగుండులాగా పెట్రోహృదయంలోకి దూసుకుపోయాయి. మంత్రగత్తె కోపంతో నేలతన్నింది. భూమినిచీల్చుకుని నీలి జ్వాల ఒకటి పైకి లేచింది. భూగర్భం స్ఫటికంలాగా స్పష్టంగా కనిపించింది. వారు నిలబడ్డస్థలంకింద బంగారపుకడ్డీలు, విలువయిన రాళ్ళతో నిండినపెట్టెలు, బిందెలు కుప్పలుకుప్పలుగా పడిఉన్నాయి. పెట్రో కళ్ళు జిగేలుమన్నాయి. తల గిర్రున తిరిగిపోయింది. పిచ్చిగా కత్తి చేతపట్టాడు. ఆ అమాయక

బాలుని రక్తం అతనికళ్ళల్లోకి జిమ్ముమని వచ్చిపడింది. చుట్టూ దెయ్యపు నవ్వు! భయంకరాకారాలు అతనిముందు గుంపులుగుంపులుగా దూకసాగాయి. మొండెం చేతితో పుచ్చుకుని మంత్రగత్తె తోడేలులాగా రక్తంతాగింది. పెట్రో తల తిరిగిపోయింది. ఎంతో కష్టంమీద కాలు కదిపి పరుగుచ్చుకున్నాడు. ఎక్కడచూసినా ఎర్రటి వెలుగే! చెట్లు రక్తంలో స్నానమాడి మండిపోతూ మూలుగుతున్నట్లున్నాయి. ఎర్రగా మండుతూ ఆకాశం వణికి పోయింది. మెరుపులాగా అగ్నిజ్వాలలు అతనికళ్ళముందు తళుక్కుమన్నాయి. రొప్పుకుంటూ తన గుడిసెలోకి పరుగెత్తుకువెళ్ళి నేలమీద దభేలునపడి మొద్దు నిద్రపోయాడు.

రెండురాత్రులు, రెండుపవళ్ళు లేవకుండా నిద్రపోయాడు. మూడోరోజున మేలుకుని గుడిసె నలుమూలలా చాలాసేపు తేరిపారజూసాడు. ఏంజరిగిందీ జ్ఞప్తికి తెచ్చుకోవాలని యత్నించాడు గాని లాభంలేకపోయింది. పిసినిగొట్టు జేబులోనుంచి కాసు బయటికి రానట్టే అతనికి ఏదీ జ్ఞాపకం రాలేదు. కాళ్ళు కొద్దిగా జాపుకునే సరికి పాదాలదగ్గర ఏదో గల్లుమంది. రెండుసంచులలో బంగారం అక్కడపడి ఉంది. అప్పటికీగాని తను నిధి కోసం ఒంటరిగా వెతకడం, అడవిలో భయపడిపోవడం స్వప్నంలోలాగా గుర్తుకు వచ్చాయి. కాని దానికోసం ఎంత త్యాగం చేసిందీ, ఎలా సంపాదించిందీ అతనికి జ్ఞాపకం రాలేదు.

బంగారం సంచులుచూసి కోర్జ్ మెత్తబడ్డాడు. పెట్రో అంతటివాడు, ఇంతటివాడు అని పొగిడాడు. "వాడంటే నా కెప్పుడూ మక్కువే! స్వంత కొడుకులాగా చూసుకున్నాను." ఆ జిత్తులమారి నమ్మకంపుట్టేటంత ఇదిగా పొగిడే సరికి పెట్రో మనసు కరిగి కన్నీళ్ళపర్యంత మయింది. ఇవాన్‌ని జిప్సీలు ఎవరో ఎత్తుకుపోయారని పిడోర్కా చెప్పింది. కాని పెట్రోకి ఇవాన్ మొహమే జ్ఞాపకంలేదు. ఆ దెయ్యం చేష్టాప్రభావం అటు వంటిది!

ఇక ఆలస్య మెందుకు? ఆ పోలండువాడిని చల్లగా సాగనంపి పెళ్ళిసన్నాహాలు మొదలుపెట్టారు. పెళ్ళిరొట్టెలు వండారు. తువాళ్ళు, జేబురుమాళ్ళు అంచులు మడిచి కుట్టారు. సీసాలతో వోడ్కా ప్రవహించింది. వధూవరులను సహపంక్తిని కూర్చోబెట్టారు. పెళ్ళిరొట్టె కోసారు. వీణ, మురళి, సితారా, తప్పెట్లు, తాళాలు వాయించారు. వేడుకలు ప్రారంభ మయాయి.

వెనుకటి రోజులలో పెండ్లిండ్లకు ఈ రోజులలో పెండ్లిండ్లకూ పోలికేలేదు. మా తాతగారి మేనత్త వాటిని గురించి చెపుతూండేది. కనులపండువుగా ఉండేవట! ఆనాడు కన్యలు పసుపునీల గులాబీరంగు రిబ్బన్ల తలపాగాలు సొగసుగా చుట్టుకుని, బంగారపు జడతగిలించుకుని, కుట్టు కుట్టుకీబుటాలు, చిన్నచిన్న వెండిపువ్వులు కుట్టిన చక్కటి లాగాలు కట్టి, ఇనప నాడాలు వేసిన ఎత్తుమడమల మొరాకొబూట్లు తొడిగి గదిచుట్టూ నెమలుల లాగా లలితంగా, సుడిగుండంలా గిర్రున

తిరుగుతూ నాట్యం చేసేవారు. ఇక పెళ్ళయినవారు పడవ ఆకారంగల పాగాలు పెట్టుకునేవారు. వాటి పైభాగం బంగారపు బుటాలు వేసిన పట్టూ. వెనక చిన్నకంత. దాంటోనుంచి లోపలి బంగారపు టోపీ కనిపించేది. ఆ తలపాగాకు ముందొకటి వెనుక ఒకటి రెండు నల్లటి కొమ్ములు. ఎర్ర అంచుల నీలిపట్టు కోట్లు తొడిగి ఠీవిగా నడుంమీద చేతులు వేసుకుని ఒక్కొక్కరూ అడుగులు వేసుకుంటూ వచ్చి హోపాకీ నాట్యం చేసేవారు. ఇక మొగపిల్లలు పొడుగాటి కోసక్ టోపీలు పెట్టుకుని బంగారపు పువ్వులు కుట్టిన పటకాలు అంగరఖాలు వేసుకుని, పిల్లంగ్రోవి ఊదుతూ ఇల్లాళ్ళ వెనక నృత్యం చేస్తూ కుప్పిగంతులు వేసేవారు.

ఆ యువదంపతులను చూసేసరికి కోర్జ్‌కి ఆతని పడుచుతనపు రోజులు జ్ఞాపకం వచ్చాయి. చేతితో తాంబురా పట్టుకుని, పైపు తాగుతూ, పాడుతూ, తలమీద గిన్నె నిలబెట్టుకుని నాట్యం చేయసాగాడు. వేడుకల సమయంలో ఎలాంటి ఆలోచనలు వస్తాయో? ఉదాహరణకు ముఖవేషాలు పెట్టుకుంటారు. అబ్బ! అపుడు ఎంత భయంకరంగా కనిపిస్తారని! ఈ రోజులలో దుస్తులదగ్గరనుంచి వేడుకుల తీరే వేరు. ఇపుడు ఏంచేస్తున్నారు? జిప్సీ దానిలాగా చిత్రవిచిత్రపు దుస్తులు ధరిస్తున్నారు. పూర్వం ఒకళ్ళు యూదు,ఇంకొకళ్ళు రాక్షసీ అయినా ముందుగా ఒకళ్ళ నొకళ్ళు ముద్దుపెట్టుకుని ఆ తరవాత జుట్టూ జుట్టూ పట్టుకునేవారు. పొట్ట చెక్కలయ్యేవరకూ నవ్వేవారు. అగ్నిహోత్రంలాగా వెలిగిపోయే టర్కీ,తాతారు ఉడు

పులు ధరించేవారు. వేళాకోళాలకు తమాషాలకు దిగిన తర వాత ఏంచేసేదీ ఎవరికీ తెలియదు. ఆ పెళ్ళికి మా తాతగారి మేనత్త వెళ్ళింది. బలే తమాషా జరిగిందట. వదులుపాటి తాతారు దుస్తులు వేసుకుని అందరికీ కప్పులతో సారా అంది స్తుంటే, దెయ్యం ప్రోద్బలంతో ఎవరో వెనుకనుంచి ఆమె మీాద ఇంత సోడ్కా పోసారు. ఇంకో ఘనుడు, నిప్పుపుల్ల గీసి ఆమె దుస్తులకు అంటించాడు. మంటలు లేచాయి. పాపం, ఆమె కంగారు పడిపోయి పదిమంది ముందు దుస్తులు తీసి వేసుకోసాగింది. ఆ నవ్వులు, ఆ కేరింతలు, ఆ అల్లరి – ఓ సంతలాగా ఉందట! నిజానికి అటువంటివేడుకలు ఏ పెళ్ళి లోనూ జరగలేదు.

పిడోర్కా పెట్రోలు హాయిగా కాపురం చేయసా గారు. వారికి కొదువ ఏముంది? కులాసాగా కాలం వెళ్ళిపో తోంది. కాని వారు కాపరంచేసేవిధం పెద్దలుచూసి "యిది బాగుపడడానికి వచ్చిందేంకాదు" అని ఏకకంఠంతో అన్నారు. "దెయ్యం కాకపోతే యీాతనికి యింతధనం యెవరిస్తారు? యీా బంగారపు రాసులు యెక్కడనుంచి వచ్చాయ్? పెట్రో భాగ్య వంతుడయినరోజునే బసవ్రుక్ మాయమయిపోయాడేం?"

'ప్రజలు కాకులు, ఏమన్నా అంటారు' అని అనుకో వచ్చు, గాని ఒక నెల గడిచిందో లేదో పెట్రో పూర్తిగా మారిపోయాడు. ఏం వచ్చిందీ ఎవరికీ తెలియదు కదలకుండా కూర్చునేవాడు. ఒక్కమాటకూడా ఎవరితోనూ మాటాడే వాడుకాదు. ఎప్పుడూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ, ఏదో

జ్ఞాపకం తెచ్చుకోవాలని యత్నించేవాడు. ఆతనిని పిడోర్కా మాట్లాడేటట్లు చేసినపుడు మాత్రం అంతా మరిచేపోయి, కులాసాగా మాట్లాడేవాడు. కాని ఖర్మంచాలక దృష్టి డబ్బు సంచులమీద పడిందో, "వుండు వుండు, మరిచేపోయాను" అని తిరిగీ ఆలోచనలోపడి ఏదో జ్ఞప్తికి తెచ్చుకోవడానికి యత్నించేవాడు. చాలాసేపు కదలకుండా కూర్చున్నతరువాత ఇంకొకక్షణంలో జ్ఞాపకంవచ్చేటట్లు ఉండేది...కాని ఊహుఁ — జ్ఞప్తికి వచ్చేదికాదు. సారాదుకాణంలో కూర్చున్నట్లు భయపడేవాడు. వోడ్కా తెచ్చియిచ్చారు. వోడ్కా తాగేసరికి మంట తిరిది. అసహ్యంవేసింది. ఎవరో వచ్చి బుజంమీద తట్టారు. కాని ఆ తరవాత మసకకమ్మేసింది. మొహంమీద చెమట ధార కట్టింది. అలసిపోయి తిరిగి కూర్చిండిపోయాడు.

పిడోర్కా చేయనిదేముంది? నాటువైద్యుల సలహా పుచ్చుకుంది. నీళ్ళల్లో మైనంవేసింది. కాస్త జనపనార కాల్చింది ♦ కాని ఏమీ ప్రయోజనంలేకపోయింది. ఈవిధంగా వేసవి గడిచింది. కోతలు, నూర్పుళ్ళు పూర్తిఅయాయి.

---

♦ జడుసుకుంటే, జడుసుకోవడానికి కారణం తెలుసుకోవాలనుకున్నప్పుడు నీళ్ళల్లో తగరంగాని మైనంగాని కరిగించిపోసేవారు. అది జడిసిన కారణం ఆకారం తాల్చేది. ఆ తరవాత భయం తీరిపోయేది. జబ్బు చేసినా, కడుపునొప్పివచ్చినా జనపనార కాల్చేవారు. రోగిపొట్టమీద నీళ్ళగిన్నె పెట్టి, నారముక్క కాల్చి కుండలోవేసి, ఆ కుండను నీళ్ళ గిన్నెమీద బోర్లించేవారు. ఆ తరవాత మంత్రించి రోగిచేత చెంచాడు నీళ్ళు తాగించేవారు. — రచయిత.

ముందుడుకు కోసక్లు యుద్ధాలకు బయలుదేరారు. పొలి మేరలో బాతుగమికి కరువులేదు. కాని రెన్ పక్షి ఒక్కటీ కానరావడంలేదు. మైదానం ఎర్రవారింది. కోసక్ల టోపీల లాగా పొలాల్లో అక్కడక్కడధాన్యపుకంకులు మచ్చలుమచ్చ లుగా గోచరిస్తున్నాయి. కట్టెపుల్లలు, దూలాలువేసిన బళ్ళు రోడ్లమీద సాగిపోతున్నాయి. నేల గట్టిపడింది. అక్కడక్కడా మంచుగడ్డ అంటుకుంటోంది. మంచు కురుస్తోంది. చెట్ల రెమ్మలు చెవులపిల్లి బొచ్చులాగా మంచుతో విలసిల్లుతు న్నాయి. మంచు కురిసినరోజున జీనువాయి పిట్టలు మంచుదిబ్బ లలో గింజలకోసం వెతుకుతూ, పోలిష్ బంటులలాగాకులుకుతూ నడుస్తున్నాయి. బాలబాలికలు పెద్దపెద్ద కర్రలతో మంచు గడ్డలమీద కొడుతున్నారు. ఇక వారి తండ్రులు ప్రశాంతంగా స్టౌవ్లమీద పడుకుని మధ్యమధ్య నోట్లో పైపులు వెలిగించి బయటికి వచ్చి మంచును తిట్టిపోస్తున్నారు. కొంతమంది హాయిగా గాలి పీల్చుకుని బయటగదిలో నిలువచేసిన ధాన్యం కొట్టడానికి బయటికి వస్తున్నారు.

మంచు కరగసాగింది. గండుచేపలు తోకలతో మంచు గడ్డను ముక్కలుముక్కలు చేస్తున్నాయి. కాని ప్యెత్రోస్థితి మాత్రం యథాప్రకారంగానే ఉంది. కాలంగడచినకొద్దీ ఇంకా చింత ఎక్కువయింది. పాదాలదగ్గర బంగారంనింపిన సంచులు వేసుకుని నేలకు అంటుకునిపోయినవాడిలా గుడిసెమధ్యలో కూర్చునే వాడు. ఎవరితోనూ కలసి మెలసి మెలిగే వాడుగాదు. జుట్టుపెంచాడు. ఆకారం భయంకరంగా తయా

రయింది. ఒకే విషయం ఆలోచించసాగాడు. ఏదో జ్ఞాపకం చేసుకోవాలని యత్నించి, అది జ్ఞాపకం రాకపోయేసరికి విసిగి, క్రుద్ధుడయిపోయేవాడు. తరచుగా ఆసనంనుంచి దిగ్గునలేచి చేతులు ఊపుకుంటూ దేనినో పట్టుకోదలచినట్టు దానిమీద స్థిరంగా దృష్టినిలిపేవాడు. ఎప్పుడో మరిచిపోయినమాటలు తిరిగీ ఉచ్చరించదలచినట్టు పెదవులు కదిలాడేవి. ఆ తరవాత కొయ్యబొమ్మలా ఉండిపోయేవాడు. కోపంతో ఒళ్ళు తెలిసేది కాదు. పిచ్చివాడిలాగా చేతులుబరుక్కునేవాడు, కొరుక్కునే వాడు, విసుగుతోజుట్టు గుప్పిళ్ళతో పీక్కునేవాడు. మళ్ళీ శాంతించి మరుపు మైకంలో మునిగిపోయేవాడు. మళ్ళీ జ్ఞాపకం వచ్చేది. మళ్ళీ కోపం, మళ్ళీబాధ! అది భగవంతుడి శాపం!

పిడోర్కా బతుకుబండలయింది. మొదటలో ఒంటరిగా గుడిసెలో ఉండడానికే భయపడిపోయింది. పాపం! తరవాత తరవాత దౌర్భాగ్యానికి అలవాటుపడిపోయింది. ఇపుడు పిడోర్కాను గుర్తుపట్టడంకష్టం. చెంపలకాంతి మాసిపోయింది. పెదవులమీద మందహాసం మాయమయింది. శుష్కించి శల్యమయిపోయింది. కళ్ళు వాచేలాగా ఏడుస్తోంది. ఒకమాటు 'ఎలుగుకనుమలోని మంత్రగత్తె ఎటువంటి వ్యాధినయినా కుదురుస్తుంది వెళ్ళిచూడ' మని ఎవరో దయదలచి సలహా చెప్పారు. ఈ ఆఖరిఉపాయంకూడా చూదామని నిశ్చయించు కుంది. క్రమక్రమంగా తనతోకూడా ఇంటికిరావడానికి ఆ మంత్రగత్తె సమ్మతించేలాగాచేసింది. సెయింట్‌జాన్ పుట్టినరోజు

ముందు సాయంకాలం సూర్యాస్తమానం తరవాత రావడానికి ఏర్పాటుజరిగింది. ఆసమయంలో పెట్రో ఒకబల్లమీద పండు కుని ఉన్నాడు. మరుపు మైకంలో మునిగిపోయాడేమో ఆ మంత్రగత్తె రావడంగమనించలేదు. క్రమక్రమంగా లేచికూర్చుని ఆమెకేసి చూసాడు. ఉరికంబం ఎక్కినవాడిలా హఠాత్తుగా వణికిపోయాడు. తలవెంట్రుకలు నిక్కబొడుచు కున్నాయి. బిగ్గరగా పిచ్చిగానవ్వాడు. ఆ నవ్వుకు పిడోర్కా హృదయం భయంతో ముడుచుకుపోయింది,

"ఆఁ. జ్ఞాపకంవచ్చింది, జ్ఞాపకంవచ్చింది!" అంటూ పెట్రో అరిచాడు, భయంగొలిపేటంత సంతోషంతో. గొడ్డలి తీసుకుని బలంకొద్దీ ఆ మంత్రగత్తెమీద విసిరాడు. గొడ్డలి సిందూరపుచెక్క తలుపుకు తగిలి రెండు అంగుళాలలోతున దిగింది. ఆ ముసిలిమంత్రగత్తె మాయమయిపోయింది. గుడిసె మధ్యలో తలకు ముసుగుకట్టిన ఒక ఏడేళ్ళపిల్లవాడు తెల్ల చొక్కా తొడుక్కుని సిలబడిఉన్నాడు. ముసుగు ఎగిరి పోయింది. "ఇవాన్!" అని అరుస్తూ పిడోర్కా అతనిదగ్గరకు ఉరుక్కుంటూ వెళ్ళింది. కాని ఆ పిశాచం ఆపాదమస్తకం నెత్తురే! గుడిసెఅంతటా ఎర్రటి వెలుగుకనిపించింది. భయపడి పోయి బయటిగదిలోకి పరుగెత్తింది. కోలుకుని తమ్ముడికి సాయపడాలనిచూసింది. కాని ఏంలాభం! తలుపు దభీమని మూసుకుంది. మరి తెరవడం సాధ్యం కాలేదు. ఇరుగుపొరుగు వారు పరుగెత్తుకుంటూ వచ్చారు. తలుపుకొట్టీ కొట్టీ విసుగెత్తి బద్దలు కొట్టారు. లోపల ప్రాణిఅంటూ కనిపించలేదు. గుడిసె

నిండా ఒకటేపొగ! మధ్యన పెట్రో నిలబడినచోట బూడిద కనిపించింది. అందులోనుంచి ఇంకా పొగవస్తోంది. సంచుల దగ్గరకు పరుగెత్తారు. బంగారుకడ్డీలకు బదులు పగిలిపోయిన కుండపెంకులు కనిపించాయి. ఈ వింతకు కోసక్‌లు హడలిపోయారు. నోళ్ళు తెరచుకుని, గుడ్లు అప్పగించి, కనురెప్ప వేయడానికైనా ధైర్యంచాలక నేలకు అంటుకునిపోయినట్టు నిలబడ్డారు.

ఆ తరవాత ఏమయిందో నాకు జ్ఞాపకంలేదు. తీర్థయాత్రలు చేస్తానని పిడోర్కా మొక్కుకుంది. తండ్రి ఇచ్చిపోయిన సంపదనంతా పోగుచేసి కొద్దిరోజుల తరవాత గ్రామం నుంచి ఎవరికీ తెలియకుండా వెళ్ళిపోయింది. ఎక్కడికి వెళ్ళిందీ ఎవరూ చెప్పలేకపోయారు. కొంతమంది బాతాఖానీరాయళ్ళు ఆమె పెట్రోను అనుసరించి వెళ్ళిందని చెప్పడం మొదలు పెట్టారు. కీవ్‌నుంచి వచ్చిన ఒక కోసక్ మాత్రం మఠంలో ఒక సన్యాసినినీ, చూసానని ఆమె చిక్కి శల్యంగా ఉందనీ, ఎప్పుడూ ఆపకుండా ప్రార్థనలు చేస్తూఉంటుందనీ అచ్చంగా పిడోర్కాలాగా ఉంటుందనీ చెప్పాడు. ఆమె నోటిమాట ఎవరూ వినలేదట. నడిచివెళ్ళి ఆమె మేరీ మాతకు ధగధగా మెరిసే ఆభరణాల కట్టడం సమర్పించుకుంది. దానిని చూస్తే కళ్ళు జిగేలుమంటాయి.

కాని ఇంతటితో సరిపోలేదు. దెయ్యం పెట్రోని ఎత్తుకుని పోయిన రోజునే బసవ్రుక్ తిరిగీ తయారయాడు. కాని

అతను కనిపిస్తేచాలు జనం పారిపోయేవారు. ఎటువంటివాడో అందరికీ తెలిసిపోయింది. భూగర్భంలోని నిధులను తవ్వి పైకి తీయడానికి మానవాకారం దాల్చిన సైతాన్! అపవిత్రమయిన చేతులతో ఆ నిధులను తాకరాదు కాబట్టి యువకులను మాయచేసి సహాయం పొందుతుంటాడు. ఆ సంవత్సరమే ఆగ్రామస్తులు తమతమ పాతగుడిసెలు వదిలిపెట్టి పక్కనున్న గ్రామానికివెళ్ళిపోయారు. అయినా ఆవెధవ బసవ్రుక్ మాత్రం వారిని వదిలిపెట్టలేదు. వేధిస్తూనే ఉన్నాడు. ఒపొష్నాయా రోడ్డులో సారాదుకాణం మూసివేసినందుకు బసవ్రుక్ కోపగించుకుని అంతకంతా పగతీర్చుకున్నాడని మా తాతగారి మేనత్త చెప్పింది. ఒకరోజున గ్రామపెద్దలు ఆవిడదుకాణంలో వారి వారిహోదాలకు తగినరీతిగాకూర్చుని మాట్లాడుకుంటున్నారట. మాటలమధ్యలో కాల్చి పక్వంచేసిన ఒక గొర్రెపోతును బల్ల మీద పెట్టారు. ఆ పోతు మరేం చిన్నదికాదు. అనేక విషయాలు - వింత వింత సంఘటనలనుగురించి ముచ్చటించుకుంటున్నారు. హఠాత్తుగా-ఒకరయితే ఏమో అనుకోవచ్చు అందరూ ఆ గొర్రెపోతు తలపైకెత్తడం, నల్లటి కొంటెకళ్ళు మెరిసిపోవడం, ప్రాణం రావడం చూసారు. హఠాత్తుగా నల్లటి బిరుసు మీసాలు దాని మూతిమీద మొలిచాయి. అక్కడి వారిని చూచి మీసం మెలివేసింది. ఆ గొర్రెపోతు మొహం బసవ్రుక్ మొహమేనని అంతా గుర్తుపట్టారు. వోడ్కా అడుగు

తాడని మా తాతగారి మేనత్త అనుకుంది. ఆ పెద్దలు టోపీలు తీసుకుని ఎవరి యిళ్ళకు వారు పరుగెత్తారు. ఇంకో రోజున: చర్చివార్డెను తన కుటుంబంవారితో కూర్చుని మద్యంసేవిస్తూ కులాసాగా ఓ గంట అపుడపుడూ గడుపుతూండడం పరిపాటి. ఒకమాటు రెండుసార్లు కప్పు ఖాళీచేశాడో లేదో కప్పు వంగి నమస్కరించింది. "నిన్ను దెయ్యం యెత్తుకుపోను!" అని అరిచి శిలువగుర్తు వేశాడు. సరిగ్గా అదేనిమిషంలో ఇంకో వింత జరిగింది. అతని అర్ధాంగి పెద్ద తొట్టిలో పిండి కలిపిందో లేదో తొట్టి హఠాత్తుగా గంతులు వేయడం ప్రారంభించింది. "ఆగు, ఆగు!" ఊహుం - ఆగందే! చేతులు నడుంమీద వేసుకొని ఆ తొట్టి గుడిసె అంతటా గంభీరంగా నృత్యం చేయసాగింది. మీకు నవ్వుతాలుగా ఉండవచ్చు. కాని ఇది మన పూర్వీకులకు నవ్వుతాలు విషయంకాదు. ఫాదరీ అఫనసీ దెయ్యాన్ని పారదోలడానికి వీధివీధికీ వెళ్ళి మంత్రోదకం జల్లాడు కాని సాయంకాలంకాగానే ఇంటి పైకప్పుమీద ఎవరో తట్టేవారనీ, గోడను బరికేవారనీ మాతాతగారి మేనత్త చాలాకాలందాకా చెపుతూండేది.

సరే! ఇక్కడ, మనగ్రామంలో ఇప్పుడు అంతాసవ్యంగా ఉందని మీరు అనుకుంటున్నారుగదూ, కాని మొన్నమొన్న మా నాన్నగారికి బాగా జ్ఞాపకమట, నాకూ జ్ఞాపకమే - కూలిపోయిన ఆ సారాదుకాణం చాయలకు సత్పురుషులు ఎవరూ వెళ్ళేవారుగారు. తరవాత చాలాకాలానికి దానికి యూదులు

స్వంతడబ్బుతో మరమ్మతు చేయించారు. పొగగొట్టంలోనుంచి పొగమబ్బులు పైకి లేచేవి. దానిని చూడడానికని తలయెత్తితే టోపీ కిందపడిపోయేది. మైదానమంతటా అవి నిప్పురవ్వలు వెదజల్లేవి. ఇక ఆ దెయ్యం - పేరెత్తితే పాపం చుట్టుకుంటుంది. తన బొరియలో కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తూంటే, ఆ ఏడుపుకు దగ్గరి అడవిలోని రూక్ పక్షులు భయపడిపోయి గుంపులుగా లేచి పిచ్చిగా అరుస్తూ ఎగిరి ఆకాశంలో చెల్లాచెదరయ్యాయి.





# కన్నెపడుచు

ఏమనుకోవాలో ఆ దెయ్యానికే తెలియాలి! క్రైస్తవులు ఏదైనా పని ప్రారంభిస్తే కుందేలు వెంటపడ్డ కుక్కలాగా నానాఅవస్థపడాలి. చివరకు ఫలితం శూన్యం. కాని దెయ్యం తలగజేసుకుని తోక కాస్త ఆడిస్తే చాలు పని పూర్తవుతుంది!

## 1

## హన్నా

ఆ గ్రామవీధుల్లో పాట రింగుమంటూ నదిలాగా ప్రవహించింది. రోజల్లా కష్టపడి పనిచేసి అలసిపోయి సాయం

వెలుగులో తమ ఉల్లాసాన్ని పాటరూపంలో వెలువరించడానికి. బాలబాలికలు గుమిగూడే వేళ అది. అయితే ఆ పాటలో విషాదం ధ్వనిస్తూండకపోదు. చింతాకులితస్వాంతయై సాయం సంధ్య మైకంతో నీలాకాశాన్ని కౌగలించుకుని సకల చరాచర ప్రపంచాన్నీ అస్పష్టం చేసింది. మునిచీకటిపడింది. కాని పాట ఇంకా ముగియలేదు. ఆ గ్రామమునసబు కొడుకు లెనోక్- తంబురా చేతబట్టి పాటకుల మధ్యనుంచి చల్లగా జారు కున్నాడు. అతను మంచి యవ్వనంలో ఉన్న కోసక్. తలమీద అస్ట్రాఖాన్ టోపీ! తంబురా మీటుకుంటూ, దానికి అను గుణంగా నృత్యంచేస్తూ దిగువకు నడుచుకుంటూ వెళ్ళాడు. వెళ్ళివెళ్ళి ఒకకుటీర ద్వారంముందు ఆగాడు. ఆ కుటీరం చుట్టూ చెర్రీచెట్లు. అట్టే ఎత్తుపెరగలేదు. ఆ కుటీరం ఎవరిది? ఆ గుమ్మం ఎవరిది? కొద్దినిమిషాలసేపు మాటాడకుండా నిల బడి తాంబురా వాయిస్తూ పాడసాగాడు:

పొద్దుగుంకబట్టె పిల్లదానా, సద్దుమణగజొచ్చె సిన్నదానా,
మనసంతనిండేనా పిల్లదానా, బేగిపరుగెత్తుకొనిరాయె సిన్నదానా!

"ఊం - నా తళుకుకన్నుల సుందరాంగి నిద్రపోతున్న ట్లుంది!" అన్నాడా కోసక్ యువకుడు పాటముగించి, కిటికీ దగ్గరకువెళ్ళి. "హన్నా! హన్నా! నిద్రపోతున్నావా? లేక పోతే బయటికివచ్చి కలుసుకోవడం యిష్టంలేదా? యెవరన్నా చూస్తారని భయమా? చలికి భయపడి నీ అందాల మోహం చూపించడంయిష్టంలేదా? భయపడకు. యిక్కడ యెవరూలేరు. పైగా వెచ్చగా వుంది. ఖర్మంచాలక యెవరన్నావస్తే నా

చొక్కాలో నిన్ను దాచేసి చుట్టూ కాసికోక బిగిస్తాను. నా హస్తాలతో నిన్ను మరుగుపరుస్తాను. యెవరికంటావడం. చలిగాలి వీస్తే నిన్ను నా హృదయానికి హత్తుకుంటాను. వెచ్చ వెచ్చని ముద్దులు పెడతాను. తెల్లని నీ చిట్టిపాదాలకు నా టోపీ తొడుగుతాను. నా హృదయసర్వస్వమా! ప్రియతమా! నా మురిపెంపు ముత్యమా! ఒక్కనిమిషంపాటు యిటుచూడు. పోనీ తెల్లని చిట్టిచేయి కిటికీలోనుంచి జాపు! ఊఁ – నువ్వు నిద్రపోవడంలేదు, గర్విష్టిచిన్నదానా!" అన్నాడు బిగ్గరగా క్షణంపాటు తన్నుతాను కించపరుచుకున్నందుకు సిగ్గుచెందిన స్వరంతో. "నన్ను పరిహాసించి ఆనందించాలని కదూ, నీ తలంపు. సరే. అయితే శెలవు!"

వెనకకు తిరిగి, టోపీసవరించుకుని, సన్నగా తంబురా వాయించుకుంటూ అహంభావంతో వెళ్ళిపోయాడు. సరిగ్గా ఆ సమయంలోనే కొయ్యపిడి ఆడింది. కిర్రుమని చప్పుడు చేసు కుంటూ తలుపు తెరుచుకుంది. పదిహేడు వసంతాలబాలిక మునిచీకటిలో భయపడుతూ భయపడుతూ చుట్టూచూసి పిడివదలకుండానే గుమ్మంబయట అడుగుపెట్టింది. సందెవెలు గులో నక్షత్రాలలాగా మెరిసిపోతూ ఆమె కళ్ళు స్వాగతం చెపుతున్నాయి. మెడలో ఎర్రటి ప్రవాళహారం తళతళా మెరిసిపోతోంది. ఆమె చెంపలమీద నెలకొన్నసిగ్గు దొంతరలు ఆ యువకుని గద్దకనులనుంచి తప్పించుకోలేకపోయాయి.

"యెందుకంత తొందర? అంది మెల్లగా. "అప్పుడే కోపం వచ్చిందీ? వేళాపాళా అక్కర్లా? వీధివెంట జనం గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. నాకు వణుకు పుడుతోంది—"

"వణికిపోకు, నా జాజిమల్లీ! నన్ను అంటిపెట్టుకో!" అన్నాడాయువకుడు. తంబురా దూరానపెట్టి ఆమె చుట్టూ చేతులు వేసాడు. ఇద్దరూ గుమ్మంలో కూర్చున్నారు. "ఒక గంటసేపు నువ్వు కనిపించకపోతే నా మనసు బాధ పడిపోతుంది!"

"నేనే మనుకుంటున్నానో తెలుసా?" అం దాయువతి విచారంతో అతనికేసి తేరిపారజూస్తూ. "యిక ముందు మనం తరుచుగా కలుసుకోవడం పడదని యెవరో నా చెవులో వూదుతున్నారు. యిక్కడి జనం మంచివాళ్ళు కారు. ఆడవాళ్ళు నావంక అసూయతో చూస్తున్నారు. యిక మొగపిల్లలు - యిటీవల మా అమ్మ నన్ను జాగ్రతో కనిపెడుతూ వుంది. యింటికి దూరంగా వున్నపుడే బావుండేది."

ఈ ఆఖరిమాటలు చెపుతూంటే ఆమె కళ్ళల్లో విషాదచ్ఛాయలు గోచరించాయి.

"యింటికి వచ్చి రెండు నెలలు కాలేదు, అపుడే విసుగెత్తిందా? బహుశా నేనన్నా విసిగెత్తి వుండవచ్చు!"

"అబ్బెబ్బే! నువ్వంటే నాకేం విసిగెత్తలేదు" అని మందహాసం చేస్తూ జవాబిచ్చింది. "నిన్ను ప్రేమిస్తున్నాను. నీ గోధుమరంగు కళ్ళుచూసి ప్రేమించాను. నువు నాకేసి చూస్తుంటే నా హృదయంలో నవ్వు నెలకొంటుంది. సంతో

షంతో నా మనసు గంతులు వేస్తుంది. నల్లటిమీసం నువ్వు తిప్పుతూంటే కనులపండుగగా వుంటుంది. తంబురావాయిస్తూ పాడుతూంటే చెవులకు యింపుగా వుంటుంది!"

"ఓ - హన్నా! నా హన్నా!" అంటూ ఆ యువకుడు ఆమెను ముద్దిడుకుని హృదయానికి హత్తుకున్నాడు.

"ఆగు, యిక చాలు, లెవ్కో! ముందిది చెప్పు. మీ నాన్నతో చెప్పావా?"

"యేం చెప్పాలి?" అన్నాడు నిద్రనుంచి అప్పుడే మేలుకొన్న వాడిలాగా. "నిన్ను పెళ్ళాడాలని అనుకుంటున్నాననేనా? అవును. చెప్పాను." కాని 'అవును. చెప్పాను' అనే మాటలలో విచారం ధ్వనించింది.

"చెపితే యేమన్నాడు?"

"యేంచెప్పను? ముసిలిపీనుగ వినిపించనట్లు నటించాడు. మామూలేగా! అల్లరిచిల్లరగా తిరుగుతున్నావని తిట్టిపోశాడు. కాని నువు విచారపడకు హన్నా! యేదో విధంగా వొప్పిస్తాగా. యీ కోసక్ మాట నమ్ము."

"సరే. నువ్వు చెప్పినట్లు వినుకుంటా - లెవ్కో! యెప్పుడయినా వినకపోతే, యిలా అని నువు చెప్పాలేగాని, నువు చెప్పినట్టు చేయకుండావుండలేను. అదిగో చూడు, చూడు!" అందామె ఆతని బుజాలమీద తలవాల్చి, వెచ్చటి ఆకాశం కేసి చూస్తూ. వారిముందున్న 'రేగిచెట్టు కొమ్మలగుండా ఆకాశం ముదురు నీలివర్ణంగా కనిపిస్తోంది. "అదిగో, అక్కడ దూరానచూడు! నక్షత్రాలు మిణుకుమిణుకు మంటున్నాయి-

ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు. దేవతలు ఆకాశంలోని తమదివ్యభవనాల కిటికీతలుపులు తెరుచుకుని మనకేసి చూస్తున్నారు. కాదూ? లెక్క! మన భూమివంక చూసున్నారు? చూడడం లేదంటావా? పక్షుల్లాగా మనుషులకీ రెక్కలువుంటే అక్కడికి, అంతయెత్తూ యెగిరిపోవచ్చు! అబ్బ! ఘోరం! యిక్కడి సిందూరవృక్షం ఒకటీ ఆకాశంఅంటదేం? 'యెక్కడో దూరదేశంలో ఒకచెట్టు ఆకాశయెత్తువవుంది. దాన్ని పట్టుకుని దేవుడు యీస్టరుకుముందురాత్రి భూమ్మీదకు దిగివస్తూంటాడు' అని చెపుతారు. అవునా?"

"ఉహుం - హన్నా! అలాకాదు. ఆకాశాన్నుంచి భూమికి వేయడానికి దేవుడిదగ్గర నిచ్చెనవుంది. దేవతలు యీస్టరు ఆదివారంముందురాత్రి దాన్ని భూమ్మీదకు వేస్తారు. దేవుడు మొదటి మెట్టుమీద అడుగువేసేసరికి దెయ్యాలు, భూతాలు తలకిందులుగా పడి పాతాళంలోకి కుంగిపోతాయి. అందుకనే క్రీస్తుపుట్టింరోజు పండగనాడు భూమ్మీద మచ్చుకు ఒక్క దెయ్యమన్నా కవిపించదు."

"విను. ఉయ్యాలలో పసిబిడ్డలాగా నీళ్ళు యెంత మృదువుగా గలగల మంటున్నాయో!" అంది హన్నా కొలనుకేసి చూపిస్తూ. కొలనుచుట్టూ గంగిరేణిచెట్లు, గాలికి కుయ్ మనే విల్లోచెట్లు, వాటి కొమ్మలు వంగి నీళ్ళల్లో మునిగాయి ఈ దృశ్యమంతా చిన్నబోయినట్టుంది. బక్కచిక్కిన ముదుసలిలాగా ఆ కొలను దూరాకాశాన్ని శీతకౌగిలిలో ఇముడ్చుకుని, తళుక్కుతళుక్కుమనే నక్షత్రాలను మంచు

ముద్దలతో నింపింది. కేరాణి అరుదెంచుతోందని వెచ్చని నిశావాయుసముద్రంలో ఆ నక్షత్రాలు మెరిసిపోతున్నాయి. చిట్టడవిపక్కన కొండమీద పాత కొయ్యఇల్లు ఒకటి నిద్రపో తున్నట్టుంది. కిటికీరెక్కలు ఎపుడూ తెరిచినట్టులేదు. పైకప్పు నిండా నాచు, పిచ్చిమొక్కలు పెరిగాయి. ఆపిలుచెట్లకొమ్మలు కిటికీలమీదకు విస్తరించుకున్నాయి. ఆ చిట్టడవి ఆ ఇంటిని తన నీడలో పొదివికొని దానిమీద కావిర ప్రతిబింబాన్ని ప్రసరింపజేస్తోంది. దాని పాదతలందగ్గరనుంచి అడవి పొదలు కొనేరువరకు వ్యాపించి ఉన్నాయి.

"కలలోలాగా నాకు జ్ఞాపకం వస్తోంది" అంది హన్నా ఆ ఇంటినుంచి దృష్టి మరల్చకుండా "యెపుడో, చిన్నతనంలో మా అమ్మదగ్గర వున్నపుడు ఆ యింటినిగురించిన భయంకర మయిన కథలు చెప్పుకునేవారు. లెనో! నీకాకథ వచ్చే వుంటుంది, నాకు చెప్పవూ?"

"ఆ కథకేమొచ్చెలే! ముసిలమ్మలు, తెలివితక్కువ దద్దమ్మలు రకరకాల కథలూ చెపుతూంటారు. అవి వింటే నువు కలవర పడిపోతావు. హడిలిపోతావు, సరిగా నిద్రపట్టదు"

"ఊఁ-చెపుదూ, చెపుదూ! నల్లబొమల వన్నెకాడా!" అంది అతని చెంపమీద మొహంపెట్టి కావలించుకుంటూ. "చెప్పవూ? అవునులే, నను నువు ప్రేమిస్తూంటేగా! యిం కొకతె యెవతెమీదనో కన్నుపడింది. నేనేం భయపడను. గుర్రుపెట్టి హాయిగా నిద్రపోతాను. కథ వినకపోతే నాకు

రాత్రంతా నిద్రపట్టదు. కథమీదే ధ్యాసపోతుంది. తోచదు.
చెప్పవదూ, లెనో్క!,,

"ఆడపిల్లలను ప్రతీదీ తెలుసుకోవాలనే కుతూహలం దయ్యంలా పట్టి బీడిస్తుందంటారు. నిజమే! సరే చెపుతావిను.. చాలాకాలంకిందట నా హృదయసర్వస్వమా! ఒక కోసక్ అధికారి ఆ యింటో నివస్తూండేవాడు. అతనికొక కూతురు. చక్కని చుక్క. మంచుగడ్డలా, నీ చిన్నారిమొహంలాగా తెల్లగా వుండేది. పాపం! అతని భార్య యెపుడో చనిపోయింది. మళ్ళా పెళ్ళిచేసుకోవాలని అతనికి బుద్ధిపుట్టింది. 'మళ్ళీ పెళ్ళి చేసుకుంటే నన్ను యిప్పటిలాగానే చూస్తావా, నాన్నా?' 'అలాగేనమ్మా! నిన్ను నా హృదయానికి యింకా ప్రేమతో హత్తుకుంటానమ్మా, హత్తుకుంటాను. నిగనిగలాడే బావిలీలు, హారాలు యిస్తాను.'

"ఆమె తండ్రి పడుచుపెళ్ళాన్ని ఇంటికి తీసుకువచ్చాడు. కొత్తపెళ్ళాం మొహం అందమయిందే. పుష్టిగా తెల్లగావుంది మనిషి. కాకపోతే సవతికూతురిని గుడ్లురిమి చూసింది. ఆ చూపుకు ఆ అమ్మాయి కెవ్వుమంది. ఆ రోజల్లా సవతితల్లి ఒక్కమాటయినా ఆమెతో మాట్లాడలేదు. రాత్రి అయింది తండ్రి పడుచుపెళ్ళాంతో పడకగదిలో ప్రవేశించాడు. ఆ చక్కని చుక్క తన గదిలో తలుపువేసుకుని పడుకుంది. ఏడుపు వచ్చి ఏడ్చింది. తలిత్తి చూసేసరికి నల్లటి పిల్లి భయంగొలుపుతూ మెల్లగా ఆమెను సమీపించింది. బొచ్చు మెరిసిపోతోంది. హడలిపోయి ఆకన్య ఒక బెంచి బల్లమీదకు ఉరికింది.

పిల్లికూడా ఆమె వెనకే బల్లమీాదకు ఉరికింది. ఆమె స్టౌవ్ మీాదికిఉరికింది. ఆమెవెనకే పిల్లికూడా ఉరికి హఠాత్తుగా ఆమె మెడమీాదికి ఎగిరి పట్టుకుని నులిమివేయసాగింది. కెవ్వుమని కేకవేస్తూ పిల్లి పట్టును విడిపించుకుని నేలకేసి కొట్టింది. మళ్ళీ ఆ దెయ్యపుపిల్లి లేచింది. ఆమె భయంతో కంపించిపోయింది. తండ్రికత్తి గోడకు వేలాడుతోంది. దానిని తీసుకుని టపీమని నేలమీాద కొట్టింది. ఒక పంజాగోళ్ళతోసహా ఎగిరి దూరాన పడింది. కీచుమని ఏడుత్తూ పిల్లి చీకటిమూాల మాయమయింది. రెండు రోజులవరకు పడుచుపెళ్ళాం గదివిడిచి బయటికిరాలేదు. మూడోరోజున చేతికి కట్టుకట్టుకుని వచ్చింది. పాపం! ఆకన్య తన సవతితల్లి మంత్రగత్తె అనీ, తానామె చేతిని నరికాననీ అపుడు ఊహించుకుంది. నాలుగోరోజున తండ్రి కూతురును పిలిచి బావినుంచి నీళ్ళు తెమ్మనీ, ఇల్లు ఊడ్చమనీ, తన గది చాయలకు రావద్దనీ ఆజ్ఞాపించాడు. పాపం! ఇదంతా ఆ అమ్మాయికి బాధాకరంగానే ఉంది. అయితేమాత్ర యేం చేస్తుంది? తండ్రి చెప్పినట్టు చేసింది. అయిదోరోజున తండ్రి కూతురిని ఇంటనుంచి వెళ్ళగొట్టాడుకూడా. ఒక్క రొట్టెముక్క యినా తీసుకుని వెళ్ళనీయలేదు. పాదరక్షలు తొడగక్కనీయ లేదు. అపుడు ఆ కన్య చేతులతో మొఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. 'నన్ను చచ్చిపొమ్మనా యింటోనించి వెళ్ళగొట్టావ్? మంత్రగత్తె నీ మనసును పాడుచేసింది. దేముడు క్షమించుగాక! యీాసుందరప్రపంచంలో నేను బతికి వుండడం ఆయనికి యిష్టంలేనట్టుంది!' అంది. అదిగో అక్కడ – కని

పించడంలేదూ?" ఆ ఇంటిని వేలితో చూపిస్తూ లెనాక్ హాన్నా కేసి తిరిగాడు. "యిలా చూడు, అక్కడ ఆ గట్టుమీద యెత్తుగాలేదూ, అక్కడినుంచి ఆ కన్య నీటిలోకి వురికింది! ఆ నిమిషంనుంచీ యెవరికీ కనిపించలేదు."

"మంత్రగత్తో?" అని హాన్నా అడిగింది, భయకంపిత స్వరంతో. కన్నీళ్ళుపెట్టుకుని అతనికేసి దృష్టి నిలిపింది.

"మంత్రగత్తె సంగతా? యీ కొలనులోపడి మునిగిపోయిన కన్యలంతా వెన్నెల రాత్రిళ్ళు వెచ్చగా వుంటుందని ఆ తోటలోకి నస్తూండడం, ఆ అధికారి కూతురు వారందరికీ నాయకత్వం వహిస్తూండడం మంత్రగత్తె కనిపెట్టింది. ఒకనాటి రాత్రి కొలనుఒడ్డున ఆకన్య సవతి తల్లిని చూసింది. చూడగానే ఆమెమీదపడి కెవ్వుమంటూ నీళ్ళల్లోకి యీ డ్చుకువెళ్ళింది. అప్పటికీ మంత్రగత్తె తనుతాను రక్షించుకోగలిగింది. నీళ్ళల్లోకి వెళ్ళిన తరవాత మునిగిపోయిన కన్యగా మారి రెల్లు చువ్వల దెబ్బలు తప్పించుకుంది. ఆడవాళ్ళని నమ్మితే యింతే! అప్పటి నుంచీ ప్రతిరాత్రీ ఆ కన్య కొలనులో పడి మునిగిపోయిన కన్యలందరినీ ఒక చోటుకుచేర్చి అందులో మంత్రగత్తె యెవరో తెలుసుకునేందుకు ప్రతికన్య మొహం పరకాయించి చూస్తోం దంటారు. కాని యింతవరకు ఆ మంత్రగత్తె పట్టుబడలేదట! ప్రాణంతోవున్న మనిషి యెవరయినా కనిపిస్తే మంత్రగత్తె యెవరోవూహించి చెప్పమంటుంది. లేకపోతే నీళ్ళల్లో ముంచేస్తానని బెదిరిస్తుందట. ముసిలి తాతయ్యలు చెప్పే కథ యిదీ. ప్రస్తుతం ఆ యింటి యజమాని అందులో సారాబట్టీ పెట్టా

లని తలపోసి సాధకుడిని పంపాడు. అవిగో, మాటలు వినిపిస్తూన్నాయి. పాట ఆపేసి మనవాళ్ళు యిటే వస్తున్నారు. యిక వెళదాం, హన్నా! హాయిగా నిద్రపో. యీ అమ్మమ్మకథలు మనసులో పెట్టుకోకు."

ఇలా అంటూ అతను ఆమెను వెచ్చగా కౌగలించుకుని, ముద్దిడుకుని, వెళ్ళిపోయాడు.

"యిక వుంటా లెవో్కా!" అంది హన్నా మగతగా ఆ చిట్టడవికేసి తేరిపారజూస్తూ.

ఆ సమయంలో పెద్ద అగ్నిగోళంలాగా ఠీవిగా చంద్రుడు ఉదయించాడు. సగంమేర ఇంకా దిజ్మండలంకిందనే ఉన్నా వెన్నెల ప్రపంచాన్నంతటినీ ముంచెత్తింది. కొలను తళతళా మెరిసిపోతోంది. పచ్చిగడ్డిమీద చెట్లనీడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"యికవుంటా,హన్నా!"ఆమె వెనకనుంచి ఈ మాటలతోపాటు ముద్దుకూడా వచ్చిపడింది.

"మళ్ళీ వచ్చావేం-" అంది వెనకకు తిరిగిచూసి. కాని ఆ కుర్రవాడో అపరిచితుడు. మొహం తిప్పేసుకుంది.

"యికవుంటా హన్నా!" అనే మాటలు మళ్ళీ వినిపించాయి. మళ్ళీ ఆ చెంపలమీద ముద్దు!

"దెయ్యం మళ్ళీ యింకొకడిని పంపింది"అందికోపంతో.

"యికవుంటా, హన్నా! ప్రియురాలా!"

"మూడోవాడు!"

"వుంటూ, వుంటూ, వుంటూ హన్నా!" నలువైపుల నుంచీ ఆమెమీద ముద్దులవర్షం కురిసింది.

"యేమిటీ, జట్టూజట్టూవచ్చి పడట్టుందే!" అంది హన్నా, ఆమెను కావలించుకోవాలని ఒకళ్ళతో ఒకళ్ళు పోటీ పడుతున్న ఆ బాలుర బారినుంచి తప్పించుకుంటూ.

"అంతూపొంతూ లేకుండా యీ ముద్దులేమిటి? విసుగెత్తడంలా? యిక నేను తలెత్తుకుని వీధిలో యెలా తిరగగలను?"

ఇలా అంటూ ఆమె తలుపు టపీమని వేసేసుకుంది. ఇనపగడియ దభీమని పడడంతప్ప మరేమీ వినిపించలేదు.

# 2

## గ్రామమునసబు

యుక్రెయిన్‌లో రాత్రిపూట ఎలా ఉంటుందో మీకు తెలుసా? తెలియదూ? అలా అయితే అదిగో చూడండి! మింటిమధ్యనుంచి చందమామ కిందికి తేరిపారజూస్తున్నాడు. బ్రహ్మాండమయిన స్వర్లోక కలశం దూరదూరాలకు బ్రహ్మాండంగా విస్తరించుకుని వెలిగిపోతూ నిశ్వసిస్తోంది. భూమాత వెన్నెలలో స్నానమాడింది. గాలి ప్రశస్తంగా, వెచ్చగా, హాయిగాఉండి సేదదీరుస్తూ సుగంధ సాగరాన్ని మధిస్తోంది. దివ్యమయిన రాత్రి! మనోహరమయిన రాత్రి! అడవులు

నిశ్చలంగా, మర్మంగా, చీకటిమయంగా ఉండి పెద్ద పెద్ద క్రీనీడలను ప్రసరిస్తున్నాయి. కొలనులు ప్రశాంతంగా, నిశ్చలంగా ఉన్నాయి. వాటిలోని చల్లటి నల్లటి నీటి చుట్టూ పచ్చ పచ్చని తోటలు గోడలు పెట్టినట్టున్నాయి. అడవిచేగి గుబురు కన్నెలు బిడియపడుతూ చలినీటిలోనికి తమవేళ్ళుపోనిస్తున్నాయి. అపుడపుడు ఆ తియ్యటి పోకిరీవెధవ, నిశావాయువు హఠాత్తుగా చాటునుంచివచ్చి ముద్దిడుకున్నందుకు కోపగించాయూ అన్నట్లు వాటి ఆకులు గొణుగుకుంటున్నాయి. గ్రామీణప్రాంతం నిద్రిస్తోంది. కాని పైనమాత్రం సజీవంగా, అద్భుతావహంగా, విజయవంతంగా ఉంది. ఆత్మ అనంతసృష్టితో, అద్భుతంతో నిండి నిబిడీకృతమవుతోంది. దాని గర్భంలోనుంచి తీయతీయని కలలు కుప్పతిప్పలుగా, సరసంగా వెలువడుతున్నాయి. దివ్యమయిన రాత్రి! మనోహరమయిన రాత్రి! హఠాత్తుగా మళ్ళీ సర్వప్రపంచము — అడవులు, కోనలు, మైదానాలు - జీవం పోసుకుంటున్నాయి. యుక్రేనియన్ కోకిల కలకూజితం వెల్లివిరుస్తోంది మింటికి మధ్య నిలబడి చంద్రుడు వింటున్నట్లు గోచరిస్తోంది. మిట్టమీది గ్రామం మంత్రబద్ధమయినట్లు నిద్రిస్తూంది. కుటీర సముదాయం వెన్నెలలోకంటె ఎక్కువ తెల్లగా, ఎక్కువ శోభాయమానంగా ప్రకాశిస్తోంది. కురచగోడలు చీకటిలో ఇంకా మిరుమిట్లు కొలుపుతున్నాయి. సంగీతం ఆగిపోయింది. అంతా నిశ్శబ్దం. సత్పురుషులు నిద్రిస్తున్నారు. అక్కడక్కడా

కిటికీలలో దీపాలు వెలుగుతున్నాయి. ఒకకుటీరంముందు ఆల స్యంగా భోజనాలుచేస్తున్నారు.

"హాపాక్, నృత్యంచేసే విధానం అదికాదు. తప్పని నాకు తెలుసు. నా ప్రాణస్నేహితుడు చెప్పుతున్న దేమిటి? ఆఁ – అవును. హాప్. ట్రా – లా! హాప్. ట్రా – లా! హాప్, హాప్, హాప్!" అని తప్పతాగిన ఒక మధ్యవయసు రైతు వీధివెంట నృత్యంచేస్తూ తనలోతాను మాట్లాడుకున్నాడు. "యే వొట్టుపడితే ఆ వొట్టు! హాపాక్ నృత్యం చేసేవిధానం అదికాదు. అబద్ధం ఆడవలసినగతి నాకేం పట్టింది? వొట్టు! విధానం అదికాదు! ఊఁ – హాప్, ట్రా – లా! హాప్, ట్రా – లా! హాప్, హాప్, హాప్!"

"ఆ తాగుబోతు వెధవని చూడండి!" అంది ఒక వృద్ధురాలు పక్కనుంచి చేతినిండా గడ్డితీసుకువెళుతూ, "యేం చిన్నవాడా! ముసలిపీనుగ! రాత్రిప్పు నడివీధిలో నృత్యం చేస్తున్నాడు! వహ్వా! పిల్లలు నవ్విపోతారనయినా లేదు! యింటికి పో! యీపాటికి గుర్రుపెట్టి నిద్రపోతూవుండాల్సింది!"

"వెళుతున్నా, వెళుతున్నా!" అంటూ ఆ వ్యక్తి నిల బడ్డాడు. "వెళుతున్నా! మునసబు అంటే నాకేం లెక్క! మునసబునిగదాఅని అందరిమీదా పెత్తనం చెలాయిస్తానంటే యెట్లా? నాకు నేనే మునసబును! నాకు నేనే మునసబును! అంతే, అంతే!" అంటూ మొరటుగా కంటబడ్డకుటీరందగ్గరకు వెళ్ళి, కిటికీముందు నిలబడి, రెక్కమీద చేయివేసి, తలుపు గడియకోసం తడుముల్లాడాడు. "ఒసే. పెళ్ళామా! తలుపు

తియ్! లే. లేచి తలుపుతియ్! యీ కోసక్ పడుకునే వేళయింది" అని అరిచాడు.

"అక్కడికివెళ్ళావేం, కాలెనిక్! అది నీ గుడిసెకాదు" అని కేకలుపెట్టారు, ఆటపాటలనుంచి ఇంటికి తిరిగివెళ్ళేకొందరు బాలికలు నవ్వుతూ. "నీ గుడిసె చూపించమా?"

"కాస్త కనికరించి పుణ్యంకట్టుకోండి, కన్నెలారా!"

"పుణ్యం కట్టుకోవాలట! విన్నావా!" అంది వారిలో ఒక బాలిక. "కాలెనిక్ యెంత వినయంచూపుతున్నాడో చూడండి! దోవచూపాల్సిందే! ఊహూఁ. ముందు నాట్యం చేస్తే!"

"నాట్యం! ఆఁ - పట్టి అల్లరిపిల్లలు!" అని కాలెనిక్ దీర్ఘాలుతీసి నవ్వుతూ వేలితో వారినిబెదిరించాడు. గట్టిగా నిలబడలేక ముందుకు తూలాడు. "ముద్దిస్తే నాట్యం చేస్తాను. ఒకరినీ విడిచిపెట్టకుండా ముద్దెట్టుకుంటాను" ఇలా అని తప్పటడుగులు వేసుకుంటూ వారివెంటపడ్డాడు. ఆ బాలికలు కెవ్వుమని ఒకరిదగ్గరగా ఒకరువచ్చి నిలబడ్డారు. కాలెనిక్ అడుగులు తడబడడంచూసి ధైర్యం తెచ్చుకుని రోడ్డుఅవతలివేపుకు పరుగెత్తారు.

"అదిగో గుడిసె!" అంటూ ఒకకుటీరంవేపు వేలితో చూపించి ఆ బాలికలు వెళ్ళిపోయారు. ఆ కుటీరం తక్కినవాటికంటె పెద్దది. ఆ ఊరి మునసబుది. మళ్ళీ మునసబును తిట్టిపోస్తూ ఆ కుటీరంవేపుకు కాలెనిక్ బయలుదేరాడు.

అటువంటి ప్రతికూలాభిప్రాయాలకు, విమర్శలకు గురి అయిన ఆ గ్రామమునసబు ఎవరు? ఓ - అతను ఆ గ్రామంలో కల్లా ప్రముఖుడు. కాలేనిక్ బయలుదేరాడు. ఈ లోపున మనం మునసబునుగురించి కొంత తెలిసికుందాం. అతను కనిపిస్తే గ్రామస్తులంతా తలలమీదినుంచి టోపీలు తీసేసు కుంటారు. బాలికలు ఎంత చిన్నవాళ్ళయినా, నమస్కరిస్తారు. మునసబుగిరీ కావాలని ఎవరు కోరుకోరు? అందరి డబ్బాల లోని నశ్యం తనదయినట్లే స్వేచ్ఛగా తీసుకుని పీల్చేవాడు. లావుపాటి మోటువేళ్ళతో రావిబెరడు డబ్బాలలోనుంచి నశ్యం తీసుకుంటూంటే ఎంత లావు రయితయినా టోపీ తీసేసుకుని గౌరవపురస్సరంగా నిలబడేవాడు. ఇక గ్రామ పంచాయితీలో బలం కొద్దిఅయినా అతనిదే పైచేయి. స్వంత అధికారం ఉపయోగించి తన ఇష్టం వచ్చిన వాళ్ళని రోడ్డు మరమ్మతులు చేయడానికో, కందకాలు తవ్వడానికో పంపుతూండేవాడు. మనిషి కటువు. పై పై మెరుగులు, పోచుకోలుకబుర్లుగిట్టవు. చాలా కాలంకితం, జారినా కాథరిన్ క్రిమియాకు వెళ్ళేటప్పుడు ఆమెకు మార్గదర్శ కుడుగా ఇతనిని నియమించారు. రెండు అహోరాత్రులూ ఈ కర్తవ్యం నెరవేర్చి జారినాగారి బగ్గీవాడి పక్కన కూర్చో డానికి తగినవాడని అనిపించుకున్నాడు. అప్పటినుంచీ ఠీవిగా సాలోచనగా తలవంచి నమస్కరించడం, పొడుగాటి వాలుడు మీసాలు దువ్వుకోవడం, డేగలాగా కోరచూపులు చూడడం మొదలుపెట్టాడు. అంతేకాదు. అప్పటినుంచీ ఏ విషయం

ప్రస్తావనకు వచ్చినా తాను జారినాకు దోవచూపడం మీాదకు, జారినా బగ్గీపెట్టెమీాద తాను కూర్చున్న విషయంమీాదకు ఏదోవిధంగా సంభాషణ మళ్ళించేవాడు. మధ్య మధ్య, ముఖ్యంగా అతనికి ఇష్టంలేని విషయం ప్రస్తావిస్తూంటే విన బడనట్లు నటించేవాడు. ఆడంబరం సహించేవాడుకాదు. ఎప్పుడో నల్లటి చేనేత పొడుగుచొక్కా తొడిగి ఉన్ని కాసికోక బిగించుకొనేవాడు. జారినా ప్రయాణ సందర్భంలో ముతక నీలికోసక్ అంగరఖా వేసుకోవడం తప్ప ఎన్నడూ వేరే దుస్తులు ధరించగా ఎవరూ చూడలేదు. కాని ఆనాటి విషయం ఎవరికీ జ్ఞాపకంలేదు. ఆ అంగరఖా పెట్టెలోపెట్టి దాచాడు. భార్య చనిపోయింది. వదినగారు వండిపెడుతోంది. ఆమెబల్లలు తుడిచేది. కటీరానికి వెల్లవేసేది. చొక్కాలు కుట్టిపెట్టేది. అంతెందుకు, ఇంటివిషయమంతా చూసేది. గ్రామస్తులు కొంత మంది ఆమె అతని వదెనగారు కాదనేవారు. కాని మన గ్రామ మునసబు అంటే ఎవరికీ అభిమానంలేదు. ఇటువంటి అపవా దులు వ్యాపింపచేయడం వారికి ఆనందం. అయితే ఈ కథకు వన్నెతెచ్చే విషయాలు లేకపోలేదు. అతను పడుచుపిల్లలు కోతలుకోసే పొలంలోకి వెళ్ళినా, పడుచుపిల్లఉన్న గృహస్థు ఇంటికి వెళ్ళినా ఆమె సహించేదికాదు. మన మునసబుకు ఒకటేకన్ను. అయితేనేం ఆ కన్ను పట్టి పోకిరీకన్ను. అంద మయిన పిల్ల ఎంత దూరానఉన్నాసరే కనిపెట్టేస్తుంది. వదిన గారు కనిపెడుతోందేమోనని ఒకమాటు చుట్టూ పరికించి చూసిన తరవాతగాని ఏ సుందరాంగిమీాదా దృష్టి నిలిపే

వాడు గాదు మునసబు. ఆ ఊరి మునసబును గురించి చెప్పుకోవలసిందంతా చెప్పుకున్నాం. ఇక కాలెనిక్ : తడబడే నాలుకకువచ్చిన తిట్లన్నీ తిడుతూ తూలుతూ నడకసాగించాడు.

# 3

## ప్రత్యర్థి - ఎత్తుకు పైఎత్తు

"ఊహుం - నేనురాను. మళ్ళీ చిలిపిచేష్టలు చేయడానికి తయారవుతున్నారుగదూ? అందుకనే నలుగురూ మనల్ని ఆకతాయిలంటున్నారు!" అన్నాడు లెవ్కో కేరింతలుకొడుతూ కొంటెపనులకు తనను ఆహ్వానించే సహచరులతో. "నేను వెళ్ళొస్తా, వెళ్ళొస్తా!" గబగబా అడుగులు వేసుకుంటూ వీధివెంట బయలుదేరి వెళ్ళాడు.

"నా తళుకు కనుల హన్నా నిద్రపోతోందా?" అనుకుంటూ ఆశ్చర్యపోయాడు మనకు సుపరిచయమయిన కేగి చెట్లకుటీరం సమీపిస్తూ. అంతా నిశ్శబ్దం. కాని ఆ నిశ్శబ్దంలో గుసగుసలు వినిపించాయి. లెవ్కో టపీమని ఆగిపోయాడు. చెట్లగుండా తెల్లని చొక్కా కానవచ్చింది. "యేమిటిదంతా? అని ఆశ్చర్యపడి, ఇంకా దగ్గరకు మెల్లగా చప్పుడు గాకుండా వెళ్ళి ఒక చెట్టుచాటున దాక్కున్నాడు. అతనిముందు ఒక బాలిక నిలబడి ఉంది. వెన్నెలలో ఆమె మొహం మెరిసిపోతోంది. ఆమెఎవరోకాదు హన్నా! ఇక వీపు అతనివేపుకుపెట్టి నిలబడ్డ ఆ పొడుగాటి వ్యక్తిఎవరు? తేరిపారజూసాడు. ఊహుం—

లాభంలేదు. పైనుంచి కిందదాకా క్రీనీడ ఆ వ్యక్తిని కప్పి వేసింది. ముందుభాగంలో కొద్దిగా వెలుతురు పడుతోంది. ఒక్క అడుగు ముందుకువేస్తేచాలు వారి కంటపడే ప్రమాదం ఉంది. చెట్టుకు నెమ్మదిగా ఆనుకుని ఉన్నచోటనే ఉండిపోవ డానికి నిశ్చయించుకున్నాడు. ఆ బాలిక అతనిపేరు ఎత్తడం విస్పష్టంగా వినిపించింది.

"లెవో్క? లెవో్క వట్టి కుర్రకుంక!" అన్నాడు ఆ పొడుగాటి వ్యక్తి బొంగురుగొంతుతో వినిపించీ వినిపించ కుండా. "నీ పక్కన యెపుడయినా కనిపిస్తే వాడి పిలక యెక్కదీస్తాను."

"నా పిలక యెక్కదీస్తానంటున్నాడు, యీ దుర్మార్గుడి సంగతేమిటో తెలుసుకోవడం మంచిది" అని గొణుక్కు న్నాడు లెవో్క నెమ్మదిగా. ఒక్కమాటకూడా పొల్లుపో కుండా వినాలనే కుతూహలంకొద్దీ మెడముందుకు చాచాడు. కాని ఆ కొత్తమనిషి మహానింపాదిగా మాటాడసాగాడు. ఒక్కమాటకూడా వినిపించలేదు.

"నీకు సిగ్గూ యెగ్గూ లేనట్లుందే!" అంది హన్నా, అతను మాటాడడం పూర్తిఅయాక. "నీవన్నీ వట్టి అబద్ధాలు. నన్ను మోసపుచ్చుతున్నావ్! నా మీద నీకు ప్రేమలేదు. ప్రేమించానంటే యెన్నటికీ నమ్మను."

"నాకుతెలుసులే. లెవో్క వెధవ ఆకబుర్లూ ఈకబుర్లూ చెప్పి మతిపోగొట్టాడు" సరిగ్గా ఈ సమయంలోనే ఆ గొంతు తనకు అపరిచితమయింది కాదని ఆ యువకుడికి తోచింది.

ఇదివరకెన్నడో విన్నట్టే ఉంది. "లెవ్కోకి నా తడాకా చూపిస్తాను!" అని కొనసాగించాడు ఆ కొత్తమనిషి. "వాడి అక తాయి చేష్టలు నేను కనిపెట్టలేదని అనుకుంటున్నాడు. నా పిడికిళ్ళమజా చవిచూపుతాలే!"

ఈ మాటలు చెవులపడేసరికి లెవ్కో కోపం అణచుకోలేకపోయాడు. మూడడుగులు ముందుకు వేసాడు. నెవరికంత మీాద ఒకగుద్దు గుద్దుదామని పిడికిలి బిగించాడు. కాని అతని మొహంమీాద వెన్నెల పడింది. ఎదురుగా తండ్రి! లెవ్కో నిర్ఘాంతపోయాడు. అప్రయత్నంగా తల ఆడించి, మెల్లగా ఈలవేయడం ద్వారా లెవ్కో తన ఆశ్చర్యాన్ని వెల్లడించాడు. గరగర శబ్దమయింది. హన్నా కుటీరంలోకి ఉరుక్కుంటూ వెళ్ళి తలుపు వేసుకుంది.

"యిక వెళ్ళివస్తా, హన్నా!" అని అరిచాడు ఒక బాలుడు మెల్లగా చప్పుడుకాకుండావచ్చి మునసబునువాటేసుకుంటూ. బిరుసు మీాసాలు గుచ్చుకునేసరికి హడిలిపోయి వెనక్కి ఒకగంతు వేసాడు.

"యిక వెళ్ళివస్తా, అందాలరాణీ!" అని అరిచాడు ఇంకొకడు. కాని మునసబు ఒక్కతోపు తోసేసరికి దూరంగా వెళ్ళి పడ్డాడు.

"వెళ్ళివస్తా, వెళ్ళివస్తా, హన్నా!" అని కేకలుపెట్టారు పలువురు బాలురు మునసబుమెడ వాటేసుకుని వేలాడుతూ.

"పొండి, పిచ్చివెధవల్లారా, పొండి!" అన్నాడు మునసబు వారిని విదిలించివేసి తన్నుతూ. "హన్నా! ఊం-

యిక యిళ్ళకిచావండి, వెధవల్లారా! తేనెకోసంపూ గే తుమ్మె దల్లా యేవిటి దంతా! మీకు బుద్ధిచెపుతా వుండండి!"

"మునసబుగారోయ్! మునసబుగారు!" అని అరుస్తూ ఆ బాలురు నలుమూలలకు చెల్లాచెదురయారు.

"ఊఁ-మా నాన్న యిటువంటివాడన్నమాట!" అనుకున్నాడు లెనోర్క్, అబ్బురపాటునుంచి కోలుకొని, తిట్టుకుంటూ వెళ్ళే మునసబును వెనకనుంచి చూస్తూ. "వెధవవేషాలు వేస్తున్నాడన్నమాట! బలే! యిందుకేకావచ్చు, పెళ్ళిమాట యెత్తినప్పుడల్లా చెవుడొచ్చినట్లు నటించడం!

"సరే కానుకో, ముసిలిపీనుగా, పడుచుపిల్లల యింటికిటికీలకిందకు చేరకుండా బుద్ధిచెపుతా! పరస్త్రీలని వలలో వేసుకోకుండా బుద్ధిచెపుతా! యేయ్ నేస్తాలూ, రండి, యిలా రండి!" అంటూ కేకపెట్టాడు చేయి పిల్లలకేసి ఊపుతూ. "యిలారండి, యింటికివెళ్ళి యికపడుకోండని చెప్పేనా, కాని యిపుడు మనసు మార్చుకుని రాత్రంతా మీతో జల్సాగా గడపాలని నిశ్చయించుకున్నా"

"అద్గదీ, అలావుండాలి!" అన్నాడు ఒక బొద్దుకుర్రవాడు. ఊరిలోకల్లా అతను మహాకొంటె. "యేదో కాస్త తమాషా చేయకపోతే నా కెదోలావుంటుంది, తోచదు. టోపీయో, పైపో పోగొట్టుకున్నట్లుంటుంది. నిజానికి కోసక్‌లా వుండను!"

"పని పట్టిద్దాం. యేవంటావు?"

"మునసబునా?"

"ఆం-ఆయనకెంత తలపొగరో తెలుసా? కొత్వాలులాగా మనమీద అధికారం చలాయిస్తున్నాడు. మనల్ని బానిసల్ని చూసినట్లు చూస్తున్నాడు. అంతటితో వూరుకుంటున్నాడా? మనం వలచిన ఆడపిల్లల వెంటపడుతున్నాడు. యీ వూరు మొత్తంలో వాడు వలలో వేసుకోని అందగత్తె అంటూ వుందా?"

"అవునవును!" అని అరిచారు పిల్లలు.

"మనమేం బానిసలమా? మనమూ వాడివంటివాళ్ళం కామా? మనం కోసకొలం, స్వతంత్రులం! మనం స్వతంత్ర కోసకొలమని వాడికి చూపిద్దాం!"

"చూపిద్దాం!" అని పిల్లలు కేకలుపెట్టారు.

"మునసబు నొక్కడినేవిఁటి, వాడి గుమాస్తాతాళం కూడా పడదాం!"

"గుమాస్తానికూడా వదలకూడదు! యిప్పుడే నేను మన మునసబుమీద మాంచి భేషయిన పాటకట్టాను. రండి మీకు నేర్పుతా." తంబురా మీటుతూ లెవోఁగ- ఇంకా అన్నాడు: "మీకుతోచినట్లు దీనికి వన్నెలుచిన్నెలుదిద్దండి."

"ఊఁ - కానీండి" అన్నాడు ఆ బొద్దుపాటి కొంటె కోనంగి. "బలే, బలే! బలేతమాషా! యేదయినా తమాషా చేస్తుంటే పండగలావుంటుంది! మనసు తేలికగా, స్వేచ్ఛగా, భూలోకస్వర్గం అనుభవిస్తున్నట్లుంటుంది. రాండి, రాండి, తమాషా చేదాం!"

అందరూ గుంపుగూడి నిశ్శబ్దంగా వీధివెంట బయలు దేరారు. వారి కేకలకు నిద్రాభంగమయిన వృద్ధమాతలు కిటికీలు మూసేసి, మగతగా శిలువగుర్తు వేసి, "ఊc- పిల్లలు ఆటలు పాటలు మొదలుపెట్టారు!" అనుకున్నారు.

# 4

## ఆ ట పా ట లు

ఊరిచివర ఒకే ఒక కుటీరంలో దీపాలు వెలుగుతున్నాయి. అది మునసబుగారి కుటీరం. భోజనం ముగించి చాలాసేపయింది. ఈపాటికి నిద్ర పోయేవాడేగాని ఎవరో వచ్చారు. ఒక భూస్వామి సారాబట్టి నెలకొల్పేనిమిత్తం అతనిని పంపించాడు. కోసక్ భూములమధ్య ఆ భూస్వామికి కొద్దిగా భూవసతి ఉంది. ఇక ఆ వచ్చినవ్యక్తి పొట్టిగా బొద్దుగా ఉన్నాడు. కళ్ళు చిన్నవి. ఎపుడూ నవ్వుతూంటాయి. పొగ తాగడంలోని ఆనందం ఆ కళ్ళల్లో ద్యోతకమవుతూంటుంది. దేవతావిగ్రహాలకిందుగా గౌరవస్థానంలో కూర్చుని మాటి మాటికి ఉమ్మివేస్తూ చిన్న పైపులోనుంచి కిందపడిపోతున్న పుగాకు బొటనవేలితో నొక్కుతున్నాడు. పొగమబ్బులు అతనిచుట్టూ వ్యాపించి ముతక నీలి పొగమంచులా కప్పేసినాయి. ఏదో సారాబట్టీ పొగగొట్టం కప్పుమీద ఉండీ ఉండీ విసుగెత్తి లేచివచ్చి మునసబుగారి కుటీరంలో అలంకారంగా కూర్చున్నట్లుంది. అతని ముక్కుకింద పొట్టి బొద్దు మీసాలు

నిక్కబొడుచుకుని ఉన్నాయి. కాని ఆ పొగలో లీలగా కన బడుతూ, పిల్లి నోరుకొట్టి నోట్లో పెట్టుకున్న ఎలుకలాగా ఉన్నాయి ఆ మీసాలు! మునసబు ఇంట్లోనే ఉన్నాడుగా అందుకని చొక్కా, పంట్లాం మాత్రం తొడుగుకుని కూర్చు న్నాడు. అతని గడ్డకన్ను కొద్దికొద్దిగా మూతపడుతూ అస్త మయ సూర్యునిలా మసకమసకలాడుతోంది. మునసబుగారి పరివారంలో ఒక కానిస్టేబు బల్లచివర కూర్చుని పైప్రు తాగుతూ గృహస్తుమీది గౌరవంకొద్దీ అంగరఖా తీసివేయ లేదు.

"తొందరలోనే బట్టీ నెలకొల్పాలని ఆలోచిస్తు న్నారా?" అని అడిగాడు మునసబు. ఆవలింత వచ్చింది. ఆవ లిస్తూ నోటిమీద శిలువగుర్తు వేశాడు.

"దేవుడిదయవుంటే, ఆకురాలు కాలంనాటికి బట్టీ మొదలుపెడతాం. యింటర్ సెషనునాటికి మునసబుగారు రోడ్డుమీద తందనాలాడుతూంటారు!"

ఈ ముక్కలు అంటూంటే ఆ సాధికుడి కళ్ళు మాయ మయినాయి. వాటి స్థానంలో ముడతలు నెలకొని చెవుల దాకా విస్తరించుకున్నాయి. కాయమంతా నవ్వుతూ ఊగి పోయింది. ఒక్కక్షణంసేపు పైప్రు పెదవులకు దూర మయింది.

"భగవంతుడి దయవల్ల అలా జరగాలేగాని అంతకంటె కావల్సిందేమిటి?" అన్నాడుగృహస్తు. మొహంచేటంతఅయింది.

"ఇప్పుడా దేవుని దయవల్ల బట్టీలంటూ వెలసినాయి. కాని వెనక నేను జారినాకి దారిచూపించిన రోజుల్లో—"

"అరే! వెనకటిగొడవ యెందుకు? ఆ రోజుల్లో రెండే రెండు బట్టీలు క్రెమిన్ చెగ్, రోమీలమధ్య వుండేవి. ఆ వెధవ జర్మన్లు యేం చేయాలనుకుంటున్నారో విన్నారా? బట్టీ పట్టటానికి కట్టెలు వుపయోగించకుండా యేదోరకం ఆవిరి వుపయోగిస్తారట!" ఇలా చెపుతూ ఆ సాధకుడు బల్లకేసి, దాని మీద తన చేతులకేసి ఆలోచనాపూర్వకంగా చూశాడు. "ఆవిరితో యెలాబట్టీ పడతారో అర్థం కావడంలేదు."

"వాళ్ళు, ఆ జర్మనీవాళ్ళు, వట్టి చవట దద్దమ్మల్లా వున్నారే!" అన్నాడు మునసబు. "వాళ్ళని కొరడాతో చిట్లగొడుదును. వట్టి సైతాను సంతానం! ఆవిరితో కాచడం విన్నామా? ఆ పద్ధతిని, పెదిమలు కాల్చుకోకుండా చెమిచాడు పులుసుకూడా తాగలేం."

"సరేగాని," అంటూ అడ్డువచ్చింది మునసబుగారి వదినగారు, స్టోవ్ మీద పద్మాసనం వేసుకునికూర్చుని. "అంత వరకూ నీ పెళ్ళాన్ని తీసుకురాకుండా వొంటరిగా యిక్కడే వుంటావా?"

"ఆఁ– అదివుంటేనేం లేకపోతేనేం? సరుకు నాణ్యమైందయితే– ఆ సంగతివేరు."

"అందంగా వుండదా, యేం?" అని మునసబు అడిగాడు అతనిమీద దృష్టి నిగిడిస్తూ.

"అందం! దెయ్యంముండ! ఖాళీసంచీలాగా మొహం నిండా ముడతలే!" ఆ సాధకుడి బొద్దుశరీరం నవ్వుతూ తిరిగి ఊగిపోయింది.

ఆ సమయంలోనే గుమ్మంలో ఎవరో తడిమిన చప్పుడయింది. తలుపు తెరుచుకుంది. ఒకరైతు టోపీతీసివేసుకోకుండానే గుమ్మందాటి తటపటాయిస్తూ, లోకప్పుకేసి నోరు తెరచుకుచూస్తూ కుటీరం మధ్యలో నిలబడ్డాడు. అతను ఎవరోకాదు మననేస్తం కాలెనిక్ !

"యెలాగయితే నేం యింటికిచేరుకున్నాను" అన్నాడు గుమ్మంపక్కని బల్లమీాదకూర్చుంటూ. అక్కడివారిని గమనించలేదు. "ఆ పాపిష్టిసైతాను రోడ్డుచు అంతపొడుగు సాగదీశాడేం? యెంతనడిచినా అంతూపొంతూ కనిపించదు. యెవళ్ళో నా కాళ్ళు విరగగొట్టినట్లుంది! అసేయ్, పెళ్ళామా! ఆ గొర్రెచర్మం తెచ్చిపరుచు. స్టౌవ్ మీాదికి రాలేను. కాళ్ళు నెప్పులు పుడుతున్నాయ్. అది యిలాతీసుకురా. దేవతావిగ్రహాలకింద పడివుంది. పొడుంకుండ బోర్లించేవిసుమీా, జాగర్త. ఉహుఁ - దాన్ని ముట్టకోకు. ముట్టుకోకు! చుక్కపుచ్చుకున్నట్టున్నావే? నేనే తెచ్చుకుంటాలే!"

కాలెనిక్ తేవాలని యత్నించాడు. కాని ఏదో బలవత్తరమయిన శక్తి అతనిని బెంచికి బిగించేసింది.

"బలే! పరాయివాడి యింట్లో ప్రవేశించి స్వంతయింట్లోలా డబాయించేస్తున్నాడు! మెడపట్టి గెంటేస్తాను."

"శాస్త్ర శ్రాంతి తీసుకోనీ, నేస్తం!" అన్నాడు సాధకుడు అతని చేయిపట్టుకుని వెనకకు లాగుతూ. "బాగా పనిచేసేమనిషి. యిలాంటివాళ్ళు యింకా పదిమందివుంటే మన బట్టీ దివ్యంగా నడుస్తుంది."

ఈ మాటలు మంచితనంమూలంగా వెలువడ్డవికావు. సాధకుడికి శకునాలమీద నమ్మకంఎక్కువ. బల్లమీదకూర్చున్న వాడిని గెంటేస్తే దురదృష్టం చుట్టుకుంటుందని అతని భావన.

"ముసిలితనంవస్తే నా గతి యేమౌతుందో?" అంటూ సణిగాడు కాలెనిక్ బల్లమీద పండుకుంటూ. "తాగితే మరేంపరవాలేదు! తాగలేము! అబద్ధం ఆడడం దేనికి? యీ ముక్క మునసబుతో చెప్పమంటే చెప్పడానికి తయార్! మునస బంటే నాకేం లెక్క! వాడిగొంతు పడిపోను, కుక్కవెధవ! వాడిమొహంమ్మీద వుమ్మేయ! యే బండో వాడిమీదగా పోతే బావుండును. ఒంటికంటి దెయ్యం! అందరినీ పీల్చి పిప్పి చేస్తున్నాడు!"

"పందివెధవ లోపలికి రావడమేకాకుండా దాష్టీకం చేస్తున్నాడు!" అన్నాడు మునసబు మండిపడుతూ. ఆసనం మీదనుంచిలేచాడు. ఇంతలో ఒక పెద్దరాయి కిటికీని ముక్కలు ముక్కలుచేసి వచ్చి అతనిపాదాలదగ్గిర పడింది. టకీమని ఆగి, "నాకు తెలిస్తేనా" అన్నాడు రాతిముక్కను పైకితీస్తూ. "యే గాడిదకొడుకు యిది వేసాడో తెలిస్తే వాడికి బుద్ధి చెప్పుదును! కొంటెవెధవ!" అంటూ కొనసాగించాడు, చేతిలోని రాయివంక కొరకొరాచూస్తూ. "వాడినోరు పడ!"

"ఆగు నేస్తం, ఆగు!" అన్నాడు సాధకుడు తెల్లపోతూ, "అలా తిట్టిపోయడం మంచిదికాదు."

"ఊఁ - వత్తాసువచ్చా. వత్తాసు!"

"మరిచేపో. నేస్తం! మరచేపో! మా అత్తగారి కేం జరిగిందో నీకు తెలవ దనుకుంటూ?"

"మీ అత్తగారికా? యేం జరిగిందేం?"

"ఒకనాటి సాయంత్రం, యింకా కొంచెం పెందలాడే, మాఅత్తగారు, మామగారు సంతానం అయిదుగురు మగకూలీ ఆడకూలీ, భోజనాలకి కూర్చున్నారు. మా అత్తగారు బోండాలు చల్లారడానికి పెద్ద భాండంలోనుంచి తీసి పళ్ళెంలో పెట్టింది. కష్టపడి పనిచేసి వచ్చారేమో మహా ఆకలిమీద వున్నారు. బోండాలు చల్లారేదాకా ఆగలేక పోయారు. పొడుగాటి కొయ్యతెడ్లతో తీసుకుని తినసాగారు. యింతలో ఒక మనిషి చక్కావచ్చాడు. యెక్కడనించి వచ్చాడో, అసలు అతనెవరో యెవరికీ తెలీదు. తనకూ భోజనం పెట్టమని అడిగాడు. సరే - ఆకలితోవున్నవాడిని యెవరు పొమ్మంటారు? అతనికీ ఒక తెడ్డు అందించారు. ఆ ఆగంతకుడు, ఆవు గడ్డిమేసి నట్టు బోండాలు పట్టించాడు. తక్కినవాళ్ళు తలొకటి తిని తెడ్లతో యింకా తీసుకోపోతుంటే, పళ్ళెం అయ్యవార్లం గారి నట్టిల్లులాగా ఖాళీఅయింది. మా అత్తగారు పళ్ళెంలో యింకాసినిపెట్టింది. 'అతడి కడుపునిండే వుంటుంది. యిక అట్టే తినిచావడు.' అనుకుంది. అబ్బే! యింకా తొందర తొందరగా మింగి పళ్ళెం ఖాళీచేసాడు. 'బోండా వాడి గొంతుక్కు

అడ్డుపడి వూపిరాడక చస్తే బావుండిపోను' అనుకుంది మా అత్తగారు ఆకలితో నకనకలాడుతూ. యింకేంవుంది? హఠాత్తుగా ఆ మానవుడికి వూపిరాడక కింద పడిపోయాడు. అంతా అతనిదగ్గరకు పరుగెత్తారుగాని యేంలాభం ప్రాణం? యెప్పుడో పోయింది. వూపిరి ఆడడంలేదు."

"బలేశాస్త్రి అయింది, పట్టి తిండిపోతువెధవ !"

"అంతటితో అయిందీ? ఆనాటినించీ మా అత్తగారి మనసుకి స్తిమితంలేదు. చీకటిపడీపడగానే ఆ వెధవ చచ్చినాడు ప్రత్యక్షమయేవాడు! పళ్ళమధ్య బోండా పెట్టుకుని పొగగొట్టంమీద అడ్డంగా కూర్చునేవాడు, పాపిష్టి వెధవ! పగలు యేగొడవా వుండేదికాదు. వాడి ఆనుపానులు తెలిసేవికావు. చీకటి పడగానే గాడిదకొడుకు వచ్చి పొగగొట్టంమీద బైఠాయించేవాడు!"

"పళ్ళమధ్య బోండా పెట్టుకుని!"

"పళ్ళమధ్య బోండా పెట్టుకుని!"

"ఓ-బలేతమాషా, నేస్తం! కీర్తిశేషురాలయిన జారినా రోజుల్లో యిటువంటి గొడవే విన్నాను—-"

టపీమని ఆగాడు. కిటికీకింద కోలాహలం, నృత్యంచేస్తున్న పాదాలరవళి వినిపించింది. ప్రారంభంలో తంబురాతీగలు లలితంగా మోగాయి. ఎవరో శృతికలిపారు. తీగలు బిగ్గరగా టంగుటంగున మోగాయి. పలుకంఠాలు కలిసేయి. సుడిగాలిలాగా పాట హోరెత్తింది.

విన్నారా క్రొత్తకబురు
ఈ సంగతి ఏమన్రా!
మన మునసబు దొరగారికి
చెడిపోయిందంట బుర్ర!
మన మునసబు మడ్డి మొగం
ఒంటికంటి వింత మృగం
మిర్రిమిర్రి చూడ్డంలో
ఊడిపడెను గుడ్డు సగం
చూస్తావేం అణగ్గొట్టు
ఇనబ్బందువేసి కట్టు
సుత్తితెచ్చి సత్తువతో
నెత్తిమీద ఒకటిమొట్టు
పంచ మహాపాతకాలు
పండారిన పండుమొగం
ఒంటికంటి మునిసీబని
అంటేనే మడ్డిమృగం
జడ్డిమొగం కోరికలను
అడ్డులేదు అదుపులేదు
కన్నెపిల్లమీద చిక్కు
కొన్న మనసు తిరిగిరాదు
కడఊపిరి ఆగినపుడు
పసుచు హాయిలం పోదువులే
పాడిమీద పెట్టినపుడు
కోడెగాని వాదువులే!

"బలేపాట, నేస్తం!" అన్నాడు సాధికుడు గృహమేధి వేపుకు తిరిగి తల ఒకపక్కకు వంచుతూ. ఇక మునసబు అలాంటి అవమానానికి నిర్ఘాంతపోయాడు. "పాట బలే బావుంది గాని మునసబుగారిని అవమానించే మాటలు వేయడంమాత్రం యేం బావుండలా!"

బయటనుంచి నవ్వులు, 'మళ్ళీ పాడు, మళ్ళీ పాడు!' అని కేకలు వినిపించాయి. ఇంకా పాట వినాలనే కుతూహలంతో, కళ్ళల్లోసంతోషంవెలుగుతుంటే మునసబు బల్లమీద చేతులు పెట్టుకుని కూర్చున్నాడు. కాని జాగ్రతగా పరిశీలిస్తే మునసబు నిర్ఘాంతపోవడానికి కారణం ఆశ్చర్యంకాదని వెంటనే తెలిసిపోతుంది. బాగా ఆరితేరిన గండుపిల్లి ఈ విధంగానే ఎలకపిల్లను తనచుట్టూ తిరగనిస్తూ తిరిగి బొరియలోకి వెళ్ళకుండా దారి బందుచేయడానికి ఎత్తు ఆలోచిస్తుంది. మునసబు ఒంటికన్ను కిటికీమీదగా స్థిరంగా నిలిచి ఉందిగాని చేయి మాత్రం కనిస్టేబుకు సంజ్ఞచేసి తలుపుగడియమీదకు వెళ్ళి పడింది. ఇంతలో హఠాత్తుగా వీధిలోనుంచి పెద్దకేక వినిపించింది. సాధికుడి పలులక్షణాలలో జిజ్ఞాస ఒకటి. ఇంకేం తొందరతొందరగా పైపువింపుకుని బయటికి పరుగెత్తాడు. కాని అప్పటికే ఆ అకతాయలు చెల్లాచదరయారు.

"ఊం-యెక్కడికి పోతారు వెధవలు!" అన్నాడు, మునసబు నల్లటిగొర్రె చర్మం ఉల్టాగా వేసుకున్న ఒకవ్యక్తిని చేయిపట్టుకుని లాగుకునివస్తూ ఈ అవకాశం తీసుకుని సాధికుడు శాంతి భంగపరిచిన ఆ వ్యక్తిని చూడడానికి పరుగెత్తు

కుని వెళ్ళాడు. కాని పెద్దగడ్డం, దారుణంగా రంగువేసిన మొహం కనిపించేసరికి హడిలిపోయి వెనకకు ఉరికాడు. "ఊఁ—యింకెలా తప్పించుకుంటావ్ ?" అని కేకపెట్టాడు మునసబు ఖైదీని ఇంటిలోకి లాక్కుని వెళుతూ. ఆ ఖైదీ పెనుగులాడకుండా స్వంతకుటీరంలోకి వెళుతున్నవాడిలాగా ప్రశాంతంగా మునసబును అనుసరించాడు. "కాస్టో ! సామానుకొట్టు తెరు" అన్నాడు, మునసబు కనిస్టేబుతో. "వీడిని ఆ చీకటి సామానుకొట్లో పడేద్దాం, తరవాత గుమాస్తాని లేపి, కనిస్టేబులును పిలిపించి, యీ కొంటెవెధవల్ని ఒకొక్కడినీ పట్టుకొచ్చి శిక్ష విధిద్దాం."

కనిస్టేబు చిన్నతాళం ఘల్లుమనిపించి సామానుకొట్టు తెరిచాడు. ఖైదీ చీకటిని ఆసరా చేసుకుని అతిప్రయాసమీద అతని చేతులునుంచి తప్పించుకున్నాడు.

"ఎక్కడికి పోదామని ?" అని అరిచాడు మునసబు ఇంకా గట్టిగా చొక్కాకాలరు పట్టుకుంటూ.

"వదిలిపెట్టు. నేను !" అని బొంగురుగొంతు సన్నగా కేకవేసింది.

"ఆ పప్పులేం వుడకవ్ ! నువ్వు దెయ్యంలాగా. ఆడదానిలాగా కీచుమని అరిచినా లాభంలేదు. నే నేం లొంగే వాడిని కాదు" ఆ చీకటి సామానుకొట్లోకి అతనిని తోసి పారేశాడు. పాపం ! ఆ ఖైదీ నేలమీదపడి మూలిగాడు. కనిస్టేబులును వెంటపెట్టుకుని మునసబు గుమాస్తా గుడిసెకు

బయలుదేరాడు. సాధకుడు పొగ ఓడలాగా పొగవదలుతూ మునసబును అనుసరించాడు

ముగ్గురూ నేలకేసిచూస్తూ, ఆలోచనలో మునిగిపోయి నడక సాగించారు. ఒక చీకటి సందులోకి మళ్ళవలసి వచ్చింది. ముగ్గురి నొప్టలమీదా టపీమని వినిపించేసరికి కెవ్వుమన్నారు. ప్రతిధ్వనిగా మళ్ళీ కెవ్వుమని వినిపించింది మునసబు కన్ను కుంచించుకుని చూసాడు. ఎదురుగా గుమాస్తా, ఇద్దరు కనిస్టేబులు ! ఆశ్చర్యం వేసింది.

"నీకోసమే వస్తున్నాను గుమాస్తాగారూ !"

"తమ దర్శనం చేసుకోవడానికే వస్తున్నానండీ మునసబుగారూ !"

"చిత్ర విచిత్రాలు జరిగిపోతున్నాయి, గుమాస్తా గారూ !"

"ఓ-చిత్ర విచిత్రాలు మునసబుగారూ !"

"యేమిటి విషయం ?"

"కుర్రకుంకలకి మతిపోయింది. సిగ్గూ యెగ్గూ లేకుండా వీధుల్లో అసహ్యంగా ప్రవర్తిస్తున్నారు. తమరిని వర్ణించే మాటలు - ఛ ! నాకే సిగ్గేస్తోంది ! తాగుబోతుకూడా అంత నీచపు మాటలు మాట్లాడడు." (పూల ఇజారు, సారామడ్డి రంగు వేస్టుకోటు ధరించిన ఆ బక్క గుమాస్తా ఈ మాటలు చెపుతూ మెడ ముందుకు వెనుకకు సాచాడు). "యిపుడే కాస్త కునుకుపట్టింది. యింతలో ఆ అడ్డగాడిదలు సిగ్గుమాలిన పాటలుపాడుతూ తలుపుకొట్టి లేపేసారు. చితకదన్నుదా మను

కున్నాను గాని యిజారు, వేస్తుకోటు తొడుగుకునేలోపల అంతా పారిపోయారు. కథానాయకుడుమాత్రం తప్పించుకో లేకపోయాడు. పట్టుకుని మా గుడిసెలో ఖైదుచేసాం. యిపుడు పాటలుపాడుతూవుండొచ్చు. యీ పక్షి యెవరా అని తెలుసు కోవాలని ఆదుర్దాగావుంది. దెయ్యం మొహంలాగా నల్లగా వుంది వాడి మొహం!"

"యెలాంటి దుస్తులు వేసుకున్నాడు?"

"నల్లటి గొర్రెచర్మం వుల్లాగా వేసుకున్నాడు, మున సబుగారూ!"

"యేమిటీ అబద్ధం! ఆ తుంటరి వెధవ మా సామాను గదిలో కూర్చునివుంటేను!"

"అబ్బే! కాదు మునసబుగారూ! క్షమించండి మీరే కాస్త పొరబాటు పడ్డారు.

"యేదీ దీపం!"

దీపం తీసుకువచ్చారు. తాళం తీశారు. ఎదురుగా వదినగారు కనిపించేసరికి ఆశ్చర్యపోయి మునసబు కెవ్వు మన్నాడు.

"యేమిటిదంతా, చెప్పు" అంటూ ఆమె అతనిమీదికి ధూకుడుగా వచ్చింది. "ఆ కాస్తమతికూడా పోయిందా యేం? ఆ చీకటికొట్లోకి నన్ను తోసేశావే నీ తలపండులో నలుసం తయినా తెలివి వుండేనా? యింకానయం తలపైన యే కొక్కెమో తగలలేదు! నేనేలని కేకపెట్టలేదూ! యెలుగ్గొడ్డు

లాగా యినప పంజాతో నన్ను పట్టుకుని లోపలికి తోసేస్తావా? నువునరకానపడ!"

ఈ ఆఖరిమాటలు ఎందుకో వీధిలోకి వెళ్ళిఅంది.

"ఓ- అవును. నువ్వే!" అన్నాడు మునసబు తమాయించుకుని "యేనంటావు గుమాస్తాగారూ! వాడు వట్టి జిత్తులమారి నక్క-కదూ?

"అవును జిత్తులమారి నక్క! వీమునసబుగారూ!"

"యీ వెధవలందరికీ బుద్ధిచెప్పి పనిలోకిపంపాలి. యిప్పటికే ఆలస్యం అయిపోయింది!"

"ఆలస్యం అయిపోయింది, మునసబుగారూ!"

"ఆ చవటలు - యేవిఁటది? మా వదెనగారు కెవ్వుమన్నట్టుంది- ఆ చవటలు నా అంతమంచివాళ్ళమని తలపోస్తున్నారు. నేనూవాళ్ళలాగానే సామాన్యకోసక నునుకుంటున్నారు." తరవాత కొద్దిగా దగ్గడం, కళ్ళుపైకెత్తడం చూస్తే మునసబు ఎదో అతిముఖ్యమైన విషయం చెప్పబోతున్నాడని తోస్తుంది. "పదిహేడు వందల-వెధవతారీఖులు గీరీకులు నాకు జ్ఞాపకం వుండవు - అపుడు కమిసారుగారికి కోసక లలోకల్లా తెలివిగలవాడిని యేరమని ఆజ్ఞలు జారీ అయాయి. ఓ!" ఆ 'ఓ' అనే అక్షరం వేలుగాలిలో ఆడిస్తూ ఉచ్చరించాడు. "జారినాకి దోవ చూపడానికి మహా తెలివయిన వాడిని-ఆ సమయంలో నేను-"

"అవునవును. మునసబుగారూ! ఆ కథంతా మాకు తెలుసు. తమకు జారినాగారిఅభిమానం ఎలా చూరగొన్నారో

మాకు తెలుసు. నే చెప్పిందేసరిఅని యిప్పుడు వొప్పుకోండి. నల్లగొర్రెచర్మంలోని తుంటరివెధవని పట్టుకున్నానని అబద్ధం చెప్పి పాపం మూటకట్టుకున్నారు !"

"నల్లగొర్రెచర్మంలోని ఆ దెయ్యపువెధవకి అర దండాలు తగిలించి యితర్లకి బుద్ధి వచ్చేటట్లు గట్టిగా శిక్షిద్దాం. అధికారం అంటే యేమిటో వాళ్ళకి రుచిచూపిద్దాం. జూరు కాకపోతే యీ మునసబును యెవరు నియమించారు? ఆ తరవాత తక్కినవాళ్ళని పట్టుకుందాం. యీ తిరుగుబోతు వెధవలు మా తోటలోకి వందులమందని తోలారు. అవి శాబేజీల్ని, దోసకాయల్ని శుభ్రంగా తినేశాయి. మరిచేపో యీననుకున్నావా? నా ధాన్యం కొట్టమంటే ససేమిరా కొట్ట మన్నారు వెధవలు ! మరిచేపోతానా? వుల్లాగా గొర్రెచర్మం వేసుకున్న ఆ తుంటరివెధవ యెవడో ముందు తెలుసుకోవాలి."

"వట్టి జిత్తులమారి నక్కలా వున్నాడే!" అన్నాడు సాధికుడు. ఈ సంభాషణజరుగుతున్నంతసేపూ అతనిని చెంపల మీాదికి పొగ ఫిరంగిలోనుంచిలాగా వచ్చి తాకుతోంది. పెద వులు పైపును వదిలిపెట్టి, గుప్పుగుప్పున పొగవదలుతున్నాయి. "బట్టీలో పనికి వాడ్నిపెడితే సరిపోతుంది. లేదూ చెట్టుకుకట్టి వురితీస్తే మరీమంచిది!"

ఇలా హాస్యాలాడడం తెలివితక్కువ అని సాధికుడికి తోచలేదు. ఇతరుల సమ్మతికోసం ఆగకుండా బొంగురుగా నవ్వి తనను తనే బహూకరించుకున్నాడు.

ఆ సమయానికి వారు నేలబారుగా ఉన్న ఒకకుటీరం ముందుకు చేరుకున్నారు. మన స్నేహితులకుకుతూహాలం తీవ్ర మయింది. గుమ్మంచుట్టూ గుమికూడారు. గుమాస్తా బీగం బయటికితీసి తాళంమీద గలగల లాడించాడు. కాని ఆ బీగం అతని పెట్టెది. ఆదుర్దా శృతిమించిపోయింది జేబులో చేయి పెట్టి కెలికాడు. కనపడలేదు. తిట్టుకున్నాడు.

"యిదిగో!' అన్నాడు, వంగి పంట్లాం జేబులోపలనుంచి బీగం బయటికి తీస్తూ.

'ఇదిగో' అన్నమాటకు మనయోధుల హృదయాలు కరిగి ఒకటి అయిపోయినట్టయింది. ఆ మహాహృదయం టక టకను తాళం కిర్రుకూడా మింగివేయలేకపోయింది. తలుపు తెరుచుకుంది. మునసబు మొహం తెల్లమతాబా అయింది. సాధికుడి ఒళ్లు ఝల్లుమంది. తలవెంట్రుకలు ఆకాశంలోకి లేచి పోతున్నట్టనిపించింది. గుమస్తా మొహంలో విపరీతమయిన భయం గోచరించింది. కనిస్టేబులు నేలకు అంటుకుపోయారు. నోళ్ళు తెరచుకున్నాయి. మరి మూసుకోలేకపోయారు. వారి ముందు మునసబుగారి వదినె ప్రత్యక్షమయింది!

వారితోపాటు ఆమెకూడా నిర్ఘాంతపోయింది. గాని ఎలాగో తమాయించుకుని వారిదగ్గరకు వెళ్ళాలని అడుగు కదిల్చింది.

"ఆగు!" అని మునసబు పిచ్చిగా అరిచి ఆమె మొహం మీదే తలుపు టపీమని వేసాడు. "మహాజనులారా! యిది సైతాన్! దీపం తెండి! త్వరగా దీపంతెండి! ప్రభుత్వం సొత్తు

అయితే అయింది యీకటీరాన్ని మిగలనియ్యకూడదు. నిప్పు అంటించండి! అంటించండి! యీ దెయ్యం యెముకలుకూడా యీ భూమ్మీద కనపడకూడదు!"

ఈ దారుణ నిర్ణయం తలుపుగుండా విని వదినగారు భయంతో కెవ్వుమంది.

"యేంజేయించుతున్నా?" అన్నాడు సాధకుడు. "నీ తల నెరిసిందన్నమాటేగాని యింకా నీకు జ్ఞానం రాలేదు. మంత్ర గత్తె మామూలు నిప్పుతో తగలబడిపోతుందా? పైపులో నిప్పుమాత్రమే దయ్యాన్ని దహించేయగలదు. ఒక్క-నిమిషం ఆగండి. వ్యవహారం నేను చూస్తాను."

ఇలా అని పైపులో కణకణమనే నిప్పు గడ్డిచుట్టమీద వేసి ఉఫ్ అని ఊదసాగాడు. పాపం! వదినగారు నిరాశతో కుంగిపోయింది. బిగ్గరగా ప్రార్థేయపడసాగింది.

"ఆగండి. పాపం మూటకట్టుకోవడం దేనికి? యేమో, సైతానుకాదేమో? యేం చెప్పగలం" అన్నాడు గుమాస్తా. "ఆ కూర్చున్నది యెవరయితేమనకేం, అది శిలువగుర్తు వేయ డానికి సమ్మతిస్తే చాలు, అది దెయ్యంకాదని రూఢిచేసుకో వచ్చు."

ఈ ఆలోచనకు అందరూ అంగీకరించారు. "నాముందా నీ ఆటలు!" అన్నాడు గుమాస్తా, పెదవులు తలుపుకంతదగ్గర పెట్టి, "వున్నచోటనుంచి కదలకుండావుంటే తలుపుతీస్తాం" తలుపు తెరుచుకుంది.

"శిలువగుర్తు వేయి!" అన్నాడు మునసబు, వెనకకు ఉడాయించవలసివస్తే సురక్షితమయినస్థలం ఎక్కడుందా అని వెతుకుతున్న వాడిలా వెనకకుచూస్తూ.

వదినగారు శిలువగుర్తు వేసింది.

"అరె! నిజంగా మా వదినగారే!"

"యీ బొరియలోకి యే దయ్యం నిన్ను లాక్కొచ్చి పడేసింది, అక్కా!"

వదినగారు వెక్కి వెక్కి ఏడుస్తూ 'వీధిలో పిల్లలు పట్టుకుని ఎంత పెనుగులాడినా వదలక ఆ కుటీరం కిటికీలోనుంచి లోపలికి తోసి వేసి కిటికీ రెక్కలకు మేకులుకొట్టారు' అని చెప్పి మొత్తుకుంది. గుమాస్తా పరకాయించిచూసాడు. కిటికీ రెక్క నాగవాసం ఊడగొట్టిఉంది. పైన బల్ల చెక్క కొట్టారు.

"బలేవాడివి, ఒంటికంటి దెయ్యపుచచ్చినాడా?" అని అరిచింది మునసబుదగ్గరకు వెళుతూ. ఒంటికంటితో ఆమె కేసి ఇంకా ఎగాదిగాచూస్తూ మునసబు వెనకడుగు వేసాడు. "నీ యెత్తు నాకు తెలియదనుకున్నావా? నన్ను కాల్చి బూడిదచేస్తే అడ్డంకిలేకుండా పడుచుపిల్లల్తో కులకచ్చనికాదూ నీ వ్యూహ! తల నెరిసిన తాతయ్యవి నీ శృంగారం చూసేవాళ్ళు లేకుండా చెయ్యాలనికాదూ నీ ఆలోచన! యివాళ సాయంత్రం హన్నాతో యేంచెప్పావో నాకు తెలియ దనుకున్నావా? అంతా నాకు తెలుసు. నా కళ్ళుగప్పటం మహామహావాళ్ళ తరంకాదు. యిక నీ బోటి తెలివితక్కువ దద్దమ్మవల్ల అవు

తుందా? యెంతయినా ఓపికపట్టగలను. కాని ఓపికతప్పిందా ఆ తరవాత పస్తాయిస్తావు.”

ఇలా చెపుతూ ఆమె మునసబువంక పిడికిలి ఝుళిపించి వెళ్ళిపోయింది. అతను నిర్ఘాంతపోయాడు.

“యిదంతా సైతానుపనే!” అనుకున్నాడు, తల బరబరా గోక్కుంటూ.

“పట్టుబడింది!” అంటూ కనిస్టేబు అరిచాడు సరిగ్గా ఆ సమయానికివచ్చి.

“యెవరు?” అని మునసబు అడిగాడు.

“పుల్లాగా గొర్రెచర్మం కప్పుకున్న దెయ్యం!”

“ఏడేనా?” అని అరిచాడు మునసబు. ఖైదీచేయిపట్టుకుని. “మతిపోయిందా? వీడు తాగుబోతు కాలెనిక్!”

“అరే! యేవిఁటీ విడ్డూరం! మేం దెయ్యాన్ని పట్టుకున్నాం మునసబుగారూ!” అని జవాబిచ్చారు కనిస్టేబులు. “సందులో ఆ వెధవకుర్రకుంకలు మాకు అడ్డంతగిలి, ఆడుతూ పాడుతూ, గుంజుతూ, నాలికజాపి వెక్కిరిస్తూ మాచేతుల్లోంచి వాడిని గుంజుకుపోయారు. వాడిబదులు వీడు మా కెక్కడ దాపరించాడో దేవుడికే తెలియాలి!”

“నేను నా తరఫునా, ప్రజలతరఫునా మీకు అధికారం యిస్తున్నాను. ఆ దురాత్ముడిని యీనిమిషంలోనే పట్టుకురండి. అ దేవిధంగా వీథిలో కనిపించినవాడినల్లా లాక్కురండి. వాళ్ళసంగతేవిఁటో తేలుస్తాను.”

"క్షమించండి, మునసబుగారూ!" అని అరిచారు వారిలో కొందరు అతని కాళ్ళముందు మోకరిల్లి. "వాళ్ళ మొహాలుచూడాలి! అసహ్యం వేస్తుంది. యింతకాలమూ యీ వూళ్ళో పుట్టాం పెరిగాం అంత భయంకరమయిన మొహాలు మేమెన్నడూ చూడలేదు. యేదో కీడు మూడుతుంది. యెంతగా జడిపిస్తారనుకున్నారు? యే ముసిలిదీ వదిలిస్తానికి ముందుకు రాదు!"

"జడిపిస్తారూ! ఊఁ-యిందాకా వచ్చిందా వ్యవహారం! నా ఆజ్ఞను ధిక్కరిస్తారా? వాళ్ళతో చేతులుకలిపారనుకుంటా. యేం తిరుగుబాటు చేయదలచారా? మీరు - సరే, కమిసార్ గారికి తెలియజేస్తా. యీ నిమషంలోనే, వినిపించిందా? యీ నిమిషంలోనే పరుగెత్తండి, గాలిలా పరుగెత్తండి! నాకు - మీకు -"

వాళ్ళంతా గబగబా పరుగెత్తుకు వెళ్ళారు.

# 5

## నీటిమీద రక్షించిన కన్య

ఈ గందరగోళానికంతటికీ మూలపురుషుడు కేకలకు పెడబొబ్బలకు కలతచెందకుండా, నాలుగువైపులకు వెతకడానికి బయలుదేరిన దళాలవల్ల చిక్కులు పడకుండా మెల్లగా ఆ పాత ఇంటికోలను వైపుకు బయలుదేరాడు. అతను లెవ్కో అని వేరే చెప్పాలా? నల్లటి గొర్రెచర్మం కోటుకు గుండీలు పెట్టుకోలేదు. చేతిలో టోపీ పట్టుకున్నాడు. మొహంమీద చెమట కాలవలు గట్టింది. గంగిరేణిచెట్లు తీవిగా, కారు నల్లగా ఉన్నాయి. రవ్వంతయినా వెన్నెల పడడంలేదు. నిశ్చలంగాఉన్న కోలను చల్లగాలిని బరపి తనఒడ్డున కాస్సేపు సేదదీర్చుకొమ్మని ప్రలోభపరిచింది. ఎక్కడా చలనంలేదు. అడవిమధ్యన ఎక్కడో కోకిల కూస్తోంది. ఆపుకోలేని నిద్ర మత్తుకు అతనికళ్ళు మూతలుపడ్డాయి. అలసిపోయిన అవయవాలు మొద్దుబారిపోతున్నాయి. తల ఒరిగింది. “ఉహుఁ - యిలాఅయితే యిక్కడ నిద్రపోవడమే!” అనుకున్నాడు, లేచి కళ్ళునులుముకుంటూ.

చుట్టూ చూసాడు. ఆ నిశమరింత దివ్యంగా ఉంది. ఒక విచిత్రమయిన, ఆకర్షణీయమయిన కాంతి ఆ వెన్నెలలో

కానవచ్చింది. అటువంటిది అతనెన్నడూ చూడలేదు. చుట్టూ వెండిలాంటి తెల్లని పొగమంచు నెలకొన్నది. ఆపిలుపువ్వుల సువాసన, రేరాణిపువ్వుల సువాసన భూమినంతటినీ ముంచెత్తుతున్నాయి. ఏ మాత్రం కదలికలేకుండా కొలను నీటికేసి ఆశ్చర్యంగా తేరిపారజూసాడు. పాతకోట నీటిలో తలకిందులుగా, విస్పష్టంగా, శీవిగా కనిపిస్తోంది. తలుపులకు కిటికీలకు కొయ్యరెక్కలకు బదులు అద్దాలు గోచరించాయి. ఆ అద్దాలలోనుంచి బంగారు మలామ తళతళలాడుతోంది. ఇంతలో ఒక కిటికీ తెరుచుకుంది. ఊపిరి బిగబట్టి, కదలకుండా, కొలను మీదనుంచి దృష్టి మళ్ళించకుండా అతను దాని అగాధంలోకి దిగిపోతున్నట్లు అనిపించింది. ముందుగా కిటికీలో తెల్లటి మోచేయి కానవచ్చింది. ఆ తరవాత మనోహరమయిన శిరస్సు, తళతళలాడే కన్నులు, ముదురు గోధుమరంగు ఉంగరాలజుట్టు పొడగట్టింది. ఆమె కిటికీలోనుంచి తొంగిచూసి మోచేతిమీద ఆనుకుంది. ఆ కన్య కొద్దిగా తల ఆడించింది. దగ్గరకు రమ్మని సంజ్ఞచేసి చిరునవ్వు నవ్వింది. అతని గుండె టకటకా కొట్టుకోసాగింది. నీరు అల్లలలాడింది. కిటికీ తిరిగి మూసుకుంది. కొలను దగ్గరనుంచి మెల్లగా ఇవతలకు వచ్చి ఆ ఇంటికేసి చూసాడు. నల్లటిరెక్కలు మళ్ళీ తెరచుకున్నాయి. "లోకులు చెప్పేమాటలు నమ్మడమెలాగా?" అని తనలో తాను అనుకున్నాడు. "యీయిల్లు కొత్తది. యివాళే రంగు వేసినట్లుంది. యెవరోయిందులో కాపురమున్నారు." నిశ్శబ్దంగా ఇంకా దగ్గరకు వెళ్ళాడు. ఇంట్లో ఎక్కడా చడీచప్పుడూ

లేదు. కోకిల దివ్యగానం బిగ్గరగా, తియ్యగా మారుమోగు తోంది. బడలికతో హాయిగా ఆ గానం ముగిసేసరికి మిడతల గలగలలూ కిచకిచలూ అందుకున్నాయి. నిర్మలంగా ఉన్న నీటి ఉపరితలాన్ని పెద్ద అద్దమని భావించి ముక్కుతో పొడిచే బాడువపక్షుల గంభీరనాదం వినిపించసాగింది. లెన్కో హృదయం మధుర నిశ్శబ్దంతో, వైశాల్యంతో, స్వేచ్ఛతో తొణి కిస లాడింది. తంబురా తీసుకుని మీటుతూ పాడసాగాడు.

నా వెలుగు వెన్నెలల జాబిల్లీ
నా వలపు వన్నియల జాబిల్లీ
పసిడి కాంతుల మెరసి
పాలవెన్నెల కురిసి
కన్నెసకియింటి నడి
వెన్ను పై నాడవే!

నెమ్మదిగా కిటికీ తెరుచుకుంది, అతనుముందు కొల నులో తానెబాలిక ప్రతిబింబం చూశాడో ఆ బాలిక శ్రద్ధగా పాటవింటూ చూస్తోంది. పొడుగాటి కనురెప్పల వెంట్రుకలు కళ్ళను సగం కప్పేశాయి. దుప్పటిలాగా, వెన్నెలలాగా ఆమె ఆ పాదమస్తకమూ తెలుపే! ఎంత దివ్యంగా, ఎంత మనోహ రంగా ఉంది! ఆమె నవ్వింది. లెన్కో అదిరిపోయాడు.

"ఒక పాట వినిపించు, కోసక్ యువకుడా!" అంది మృదువుగా, ఒక వైపుకు తలవంచి, బొద్దు కనురెప్ప వెంట్రు కలతో కళ్ళు మరుగుపచ్చుకుంటూ.

"యేపాట పాడమంటావు, అందాల చిన్నదానా!"

ఆమె పాలిపోయిన చెంపలమీద కన్నీరు ప్రవహించింది.

"యువకుడా!" ఆమె మాటలో చెప్ప నలవిగానిదీనత్వం ధ్వనించింది. "యువకుడా! నా సవతితల్లిని వెతికితీసుకురా. నీకు యేం కావలిస్తే అది యిస్తాను. బహుమానం యిస్తాను. ధన ధాన్యాదులిస్తాను. పట్టుచుల చొక్కాలు, పగడాలు, కంఠాభరణాలు నాదగ్గరవున్నాయి. ముత్యాల కాసికోక యిస్తాను. యువకుడా! నాసవతితల్లిని వెతికి తీసుకురా! అది గొప్ప మంత్రగత్తె. దానిమూలంగా నాకుజీవితంలో మనశ్శాంతి లేకుండాపోయింది. నన్ను నానాహింసలూ పెట్టింది. సామాన్య రైతుపిల్లలాగా నాచేత పనిచేయించింది. నా మొహంచూడు: పాడుమంత్రాలతో నా చెంపలలోని కాంతిని హరించింది. నా మెడచూడు: మాసిపోవు, మాసిపోవు, యినపగోళ్ళతో చేసిన గాయాల మచ్చలు, యెన్నటికినీ మాసిపోవు! యివిగో నా పాదాలు చూడు: యెంతదూరం నడిచాయనుకున్నావు? మెత్తటి తివాసీలమీద కాదుసుమా! కాలిపోయే యిసకమీద, తడి నేలమీద, కస్సున గుచ్చుకునే ముళ్ళమీద నడిచాయి! యిక నా కళ్ళుచూడు: యేడ్చి యేడ్చి కాయలు కాసిపోయాయి. వెతికి తీసుకురా, యువకుడా, వెతికి తీసుకురా?"

లేచిన గొంతు మౌనం వహించింది. కన్నీరు చెంపలమీద కాలవగట్టింది. బాధాకరమయిన విషాదకరుణా భావంతో ఆ యువకుని హృదయం కరిగిపోయింది.

"నీకోసం యేమయినా చేస్తాను, అందాల చిన్నదానా!" అన్నాడు ఉద్రేకంతో. "కాని యెలా? ఆమె యెక్కడుంది?"

"చూడు, చూడు!" అందామె తొందర తొందరగా. "యిక్కడేవుంది. చిన్నారి కన్నెలతో ఆడుకుంటూ యీ కొలనుగట్టున వెన్నెట్లో విహరిస్తోంది. కాని అది పట్టి జిత్తుల మారి. నీటమునిగి చనిపోయిన కన్యారూపం ధరించింది. నాకు తెలుసు, నా మనసుకు తెలుసు. యిక్కడేవుంది. నన్ను హింసిస్తోంది. మెడ నులిమేస్తోంది. దాని మూలంగా నేను చేపలాగా తేలికగా హాయిగా యీదలేకపోతున్నాను. రాయి లాగా మునిగి నీటి అడుగుకు పోతున్నాను. వెతికి తీసుకురా, యువకుడా!"

లెవ్కో గట్టుకేసి చూశాడు. పల్చ పల్చని తెల్లని పొగమంచులో తెల్లకలువలంత తెల్లనిలంగాలు కట్టుకుని కీనీడలలాగా తేలికగా కన్యలు ఎకసెకాలాడుకుంటున్నారు. వారి మెడలలో బంగారు హారాలు, పూసల హారాలు, నాణేలు మెరిసిపోతున్నాయి. కాని వారి మొహాలు పాలిపోయి ఉన్నాయి. వారి శరీరాలు స్వచ్ఛమైన మేఘాలతో రూపొందించినటుల, వెండిలాంటి వెన్నెల వాటిగుండా ప్రకాశిస్తున్నట్టు తోచింది. ఆడుతూపాడుతూ ఆ కన్యలు అతనిని చేరవచ్చారు. వారిమాటలు వినిపించాయి.

"మాలకాకి - కోడిపిల్లలు ఆట ఆడుకుందాం." అని ప్రశాంతమయిన సందె వెలుగులో వాయుదేవుని పెదవులు తాకిన రెల్లుకన్నెలలా గొణుగుకో సాగారు.

"మాలకాకిగా యెవరుంటారు?"

చీట్లు వేశారు. ఒకబాలిక ముందుకు వచ్చింది. లెవ్కో ఆమెను సూక్ష్మంగా పరీక్షించిచూశాడు. ఆమె మొహం, దుస్తులు అచ్చంగా తక్కినవారివాటివలెనే ఉన్నాయి. కాని ఆమెకు మాలకాకిగా వ్యవహరించడం ఇష్టంలేదని కనిపెట్టాడు. ఆ బాలికలు వరసగా నిలబడి, క్రూరశత్రువుబారినుంచి తప్పించుకోవడానికి అటూఇటూ పరుగెత్తారు.

"ఉహూం- నేను మాలకాకిగా వుండను" అంది ఆ కన్య అలసిపోయి, విసుగెత్తి. "పాపం! ఆ తల్లి పక్కనుంచి పిల్లల్ని లాక్కుపోవడం నా కిష్టం లేదు."

"యీమె మంత్రగత్తెకాదు" అనుకొన్నాడు లెవ్కో.

"ఐతే మాలకాకిగా యెవరుంటారు?"

మళ్ళీ చీట్లు వేయటానికి ఆ కన్యలు సిద్ధమయినారు.

"నే నుంటాను" అని వారిమధ్యలోనుంచి ఒక కన్య తనంతట తానే ముందుకు వచ్చింది.

లెవ్కో ఆమెమొహంకేసి శ్రద్ధగాచూశాడు. ధైర్యంగా వేగంగా ఆమె ఆ కన్యలవెంటబడి ఎవరినో ఒకరిని పట్టుకోవాలని ఆ పక్కకూ ఈ పక్కకూ పరుగెత్తింది. ఆమె శరీరం తక్కినకన్యల శరీరాలలాగా స్వచ్ఛంగాలేదని లెవ్కో హఠాత్తుగా గమనించాడు. లోపల నల్లగా ఉంది. హఠాత్తుగా కెవ్వుమని కేక వినిపించింది. మాలకాకి ఒకకన్యమీద పడి ఒడిసె పట్టుకుంది. ఆమె గోళ్ళుజాపినట్లు ఆమె మొహం ద్వేషంతో మండిపోతున్నట్లు లెవ్కోకి తోచింది.

"అదిగో మంత్రగత్తె!" అన్నాడు, ఆమెను హఠాత్తుగా వేలితో చూపి, ఇంటివైపుకు వెళుతూ.

కిటికీదగ్గర కన్య పకపకా నవ్వింది. మాలకాకిగా వ్యవహరించిన కన్యను కేకలు వేసుకొంటూ ఆ బాలికలు తీసుకు చక్కాపోయారు.

"నీ కేమిస్తే ఋణం తీరుతుంది, యువకుడా! నీకు బంగారం అక్కర్లేదని నాకు తెలుసు. నువు హన్నాను ప్రేమిస్తున్నావు. కాని మీ నాన్నకి దయాదాక్షిణ్యాలు లేవు. నిన్ను ఆమెను పెళ్ళి చేసుకోనీయడు. అంతేగదూ! యిక నీ దోవకు అడ్డురాకుండా జేస్తాను. యిదిగో యీ చీటీ తీసుకువెళ్ళి మీ నాన్నకి యియ్."

తెల్లటి చేతిని జాపింది. ఆమె మొహం విచిత్రమైన కాంతితో దేదీప్యమానంగా వెలిగిపోయింది. ఆందోళనతో ఆదుర్దాతో అతని గుండె టకటకా కొట్టుకుంది. చీటిని అందుకున్నాడు.... మెలకువ వచ్చింది.

# 6

## మెలకువ

"అరే! నిద్రపట్టిందే!" అనుకుంటూ ఆశ్చర్యపోయాడు లెవ్కో గట్టుమీద మేలుకొని. "నిజంగా జరిగినట్టే వుందే!" అన్నాడు చుట్టూ చూస్తూ.

నడినెత్తిమీద చందమామ ప్రకాశిస్తున్నాడు. అంటే సరిగ్గా అర్థరాత్రి అయిందన్నమాట. కొలను నుంచి చలిగాలి వీచింది. పాత ఇల్లు తలుపులు కిటికీలు మూసుకుని విచారంలో మునిగిపోయినట్లుంది దానిమీద పెరిగిన నాచు, పిచ్చి మొక్కలు చాలాకాలంగా ఖాళీగా ఉందని తెలుపుతున్నాయి. నిద్రలో గట్టిగా ముడుచుకున్న పిడికిలి విప్పాడు. చీటి కనిపించేసరికి ఆశ్చర్యంతో "అరే!"అని అరిచాడు "దీంటో యేవుందో చదవగలిగితేనా!" అని తలపోసాడు, చీటీని అటూ ఇటూ తిప్పిచూస్తూ. ఆ సమయంలో వెనక ఏదో గోల వినిపించింది.

"భయపడకండి, పట్టేసేయండి! భయపడతారెందుకు? డజనుమందిమివున్నాం. మరేం పరవాలేదు. దెయ్యంగాదు మనిసే, నే చెపుతున్నాగానమ్మండి" అంటూ మునసబు అనుచరులను కేకవేసాడు. భయంతో వణికిపోతూ కొంతమంది లెవ్కోను గట్టిగా పట్టుకున్నారు. "యీ వెధవవేషం తీసే

సెయ్. మమ్మల్నందర్నీ గాడిదల్ని చేసి ఆడిద్దామనుకున్నావా? యిక కట్టిపెట్టు!" అన్నాడు మునసబు లెనోక్స్ మెడపట్టి పట్టుకుని. కాని తీరా చూసేసరికి తన కొడుకే! నిర్ఘాంతపోయాడు. "లెనోక్స్!" అని అరిచాడు ఆశ్చర్యంతో వెనకడుగు వేసి చేతులు దింపుకుంటూ. "నువ్వేరా గాడిదకొడకా! దెయ్యపు వెధవా! యీ చిలిపిచేష్టలు చేస్తున్న తుంటరివెధవ యెవడా అని ఆలోచిస్తున్నా. యిదంతా నీపనే అన్నమాట! వీధుల్లో అల్లరి సాగిస్తు పాటలుకడుతున్నావా? ఊఁ - లెనోక్స్! యేవిటిదంతా? నీ వీపు దెబ్బలకోసం యేడుస్తున్నట్లుంది! వీడ్ని కాళ్ళు చేతులూ కట్టేయండి!"

"కాస్త - ఆగునాన్నా! యీ చీటి నీకిమన్నారు" అన్నాడు లెనోక్స్.

"యిది చీట్లకీ గీట్లకీ సమయంకాదు. కట్టేయండి!"

"ఆగండి మునసబుగారూ!" అన్నాడు గుమాస్తా చీటి ఊడదీసి. "కమిసారుగారి దస్తూరిలా వుంది!"

"కమీసార్‌గారి దస్తూరా ?"

"కమీసార్‌గారిదా ?" అని కనిస్టేబులు చిలకల్లా ఆ మాటలే అన్నారు.

"కమీసార్‌దా ? చిత్రం! విడ్డురంగావుందే !" అనుకున్నాడు లెనోక్స్.

"చదువు, చదువు !" అన్నాడు మునసబు. "కమీసారుగారు యేంరాసారు ?"

"కమీసార్ యేంరాసారో విందాం" అన్నాడు సాధి కుడు పైపునోట్లో పెట్టుకుని నిప్పుపుల్ల వెలిగిస్తూ.

గుమాస్తా గొంతు సవరించుకుని చదవ నారంభించాడు.

"గ్రామ మునసబు యెవటుక్ మ కొగొ నెంకోకు ఆదేశాలు : ముసిలిపీనుగా ! పాతబకాయిలు వసూలుచేసి క్రమ పద్ధతిలో వుంచకుండా నువ్వే తెలివి కోల్పోయి అవమానకరంగా ప్రవర్తిస్తున్నావని మా చెవిని పడింది—"

"అబ్బ ! ఒక్కమాటా వినిపించి చావడంలేదు !"

గుమాస్తా తిరిగి చదవడం మొదలుపెట్టాడు.

"గ్రామమునసబు యెవటక్ మకొగొ నెంకోకు ఆదేశాలు ! ముసిలిపీనుగా.—"

"ఆగు. ఆగు ! ఆ ముక్కచదవద్దు" అని అరిచాడు మునసబు. "నాకు వినిపించకపోయినా అసలు విషయం అది కాదని నాకు తెలును. తరవాత చదువు."

"అందుచేత నీ కొడుకు లెవోక్కి మీ వూరిలోని హాన్నా అనే కోసక్ పిల్లకు పెళ్ళిచేయి. రాజమార్గంమీద వంతెనలు బాగుచేయించు. సరాసరి ప్రభుత్వ కచేరీలనుంచి వచ్చినా న్యాయస్థానంలోనివారికి నా అనుమతి లేందే వూరిలో వారి గుర్రాలు యివ్వరాదు. యిది నా ఆజ్ఞలు. నేను వచ్చే సరికి యీ నా ఆజ్ఞలు అమలుజరవకపోతే దాని బాధ్యతంతా నువే వహించవలసి వుంటుంది. కమిసార్, ఇట్లు ఫించను పుచ్చుకున్న లెఫ్టినెంటు కొజ్మాడెరాక్బ్-డ్రిష్పనోవస్కీ."

"బలే!" అన్నాడు మునసబు ఆశ్చర్యంతో నోరు తెరిచి చూస్తూ. "విన్నారా? దీనికంతకి మునసబు బాధ్యత వహించాలి! అందువల్ల కిమ్మనకుండా మీరు నేను చెప్పినట్లు చేయండి. లేకపోతే మీకు శాస్తి అవుతుంది. యిక నీ సంగతి" అన్నాడు లెవ్కోకేసి తిరిగి. "కమిసార్ చెవిని యెలాపడిందో తెలీలేదు కాని, ఆయనగారి ఆజ్ఞ అయిందిగా, నీకు పెళ్ళి చేస్తాను. కాని ముందు నువ్వు నా కొరడామజా రుచిచూడాలి! దేవుడి అలమారాపక్కన గోడకు వేలాడుతున్న కొత్తకొరడా! రేపు దాన్ని పైకితీస్తాను. యింతకీ అసలు యీ చీటీ నీ చేతి కెలా వచ్చింది?"

వ్యవహారం యిలా అడ్డంతిరిగినందుకు విస్మయంచెందినా లెవ్కో మనసులో జవాబుసిద్ధంచేసుకుని చీటి తనకులభించిన విధం తెలియనీయకుండాఉంచేటంత వివేకం నిలబెట్టుకున్నాడు.

"కిందటి రాత్రి నేను పట్నంవెళ్ళాను. బగ్గీలోనుంచి దిగుతూ కమిసార్‌గారు నన్నుచూసారు. నేను యీ గ్రామస్తుణ్ణని తెలుసుకుని యీచీటీయిచ్చి 'తిరిగివచ్చేటప్పుడు యిక్కడకు వచ్చి భోజనానికి వుండిపోతాను అని మీ నాన్నతో చెప్పు' అన్నారు"

"ఆయనే చెప్పాడా?"

"ఆఁ - ఆయనే!"

"విన్నావా?" అన్నాడు మునసబు హుందాగా సహచరులకేసి తిరిగి. "కమీసారుగారు స్వయంగా నా బోటివాడి యింటికి, భోజనానికి మరీవస్తున్నారు. ఓ!" వేలుపైకిపెట్టి ఏదో

వింటున్నవాడిలాగా తలఎత్తాడు. "కమీసార్ - విన్నావా, కమీసార్? మా యింటికి భోజనానికి వస్తున్నారు. యేమం టారు, గుమాస్తాగారూ, నువేమంటావ్, నేస్తం! దులిపేసు కుంటే పోయేగౌరవమా!"

"నాకు జ్ఞాపకం వున్నంతవరకు" అంటూ ప్రారంభిం చాడు గుమాస్తా. "యే గ్రామ మునసబు యింటికీ యేకమీ సార్ విందుకు వెళ్ళలేదు."

"మునసబులు లక్షమందివున్నారు"అన్నాడు మునసబు నీటుఒలికిస్తూ. నోరు మెలితిరిగింది. పెదవులనుంచి దూరపు మేఘగర్జనలాగా బొంగురునవ్వు వెలువడింది. "గొప్పవారు దయచేస్తున్నారా, ప్రతివాళ్ళూ యే కోడిపిల్లనో లేకపోతే యేదోఒకటి సమర్పించుకోవాలని ఆజ్ఞలు జారీచెయ్యొద్దూ, గుమాస్తాగారూ?"

"తప్పకుండా, మునసబుగారూ!"

"మరి పెళ్ళియెప్పుడునాన్నా!"అని లెవ్కో అడిగాడు.

"పెళ్ళా! నిజంగాపెళ్ళిచేసేవాడినే! సరే, ఊఁ - కమీ సార్ గారి సెలవయిందిగా, రేపుఫాదరీవచ్చి వివాహంజరిపిస్తాడు. వెధవ! కర్తవ్యనిర్వహణ అంటే యేమిటో కమీసార్ గారికి తెలుస్తుంది. సరే, పడుకునేవేళయింది. యిళ్ళకి వెళ్ళండి. యివాళజరిగింది చూస్తే నేను —" ఈ మాటలు చెపుతూ ఠీవి, ఘనత ఒలికిస్తూ తేరిపారజూసాడు.

"జారినాకి మార్గం యెలాచూపిందీ మునసబుగారు వర్ణించి చెప్పబోతున్నారు" అని లెవో్క గబగబా అడుగులు వేసుకుంటూ చిరపరిచితమయిన కుటీరానికి బయలుదేరాడు.

'నీకు స్వర్గం ప్రాప్తించుగాక! అందాల చిన్నదానా!" అనుకున్నాడు తనలోతాను. "నువు స్వర్గలోకంలో దేవతల మధ్య శాశ్వతంగా మందహాసంచేస్తూ గడుపుదువుగాక! యీ రాత్రి జరిగిన అద్భుతం యెవరితోనూ చెప్పను నీ వొక దానితో తప్ప, హన్నా! నీకుమాత్రం చెపుతాను. నువు నమ్ముతావు. మనం యిద్దరం కలిసి నీటమునిగి మరణించిన ఆ దురదృష్ట కన్య ఆత్మకు శాంతిప్రసాదించమని భగవంతుడిని ప్రార్థిద్దాం!"

కుటీరందగ్గరకు వెళ్ళాడు. కిటికీ తెరచిఉంది. తలకింద చేయపెట్టుకుని, చెంపలు మెరసిపోతుండగా నిద్రిస్తున్న హన్నా మీద వెన్నెలవచ్చిపడుతోంది. ఆమె పెదవులు కదిలాయి. వినిపించీ వినిపించకుండా అతనిపేరు ఉచ్చరించింది. "నిద్రపో అందాలరాణీ! నిద్రపో! మెలకువలోకంకంటె యెక్కువ మధురం కాకపోయెనా మధురాతిమధురమయిన కలలు కను!"

ఆమెపైన శిలువగుర్తు వేసి, కిటికీ మూసి లెవో్క-మెల్లగా నడుస్తూ వెళ్ళిపోయాడు.

కొద్దినిమషాలలో గ్రామస్తులంతా నిద్ర పోయారు. అంతూపొంతూలేని యూక్రేనియన్ ఆకాశవీధిలో ఒక్క

చంద్రుడుమాత్రం దివ్యప్రభతో వెలుగొందుతున్నాడు. పైన అదే దివ్యప్రభ! ఇకరాత్రి, దివ్యమయిన రాత్రి అదే శోభతో ప్రకాశిస్తోంది. అద్భుతావహమయిన వెన్నెలలో భూమి మనోహరంగా ఉంది. కాని ఎవరూ కొనియాడడంలేదు, అంతా నిద్ర పోతున్నారు. మధ్యమధ్య కుక్కలు మొరిగి నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నవి. నిద్రిస్తున్న వీథులవెంటతాగుబోతు కాలెనిక్ తూలుతూ తనకుటీరంకోసం వెదుకుతూ పరుగిడుతున్నాడు.





# పోయిన ఉత్తరం

## బండారి చెప్పిన యదార్థ గాథ

తాతయ్యనిగురించి ఇంకో కథ చెప్పమంటారా? సరే — అలాగే చెపుతా. మీకు కథ చెప్పి సంతోషపెట్టడంకంటె కావలసిందేవుంది? పూర్వకాలం! సంవత్సరాలను నెలలను మరిపించేటంత పూర్వకాలంలో జరిగిన విశేషాలు వింటూంటే మనసుకు ఎంత ఆనందం! అందులోనూ తాతతో ముత్తాతతో వాటితో సంబంధంఉంటే ఇంక వేరే చెప్పాలా? మా ముత్తాత గారి ఆత్మలోకి ప్రవేశించి నేనే స్వయంగా ఆ యా పనులు చేసానని ఊహించుకుంటూంటాను. లేదా మా ముత్తాతగారి ఆత్మే నాలో ప్రవేశించి నేను అలా అనుకునేటట్టు చేస్తోం

దేమో! మన బాలికలు, యువతులు నన్ను మహా వేధించుకు తింటారు. నేను కంటపడితేచాలు : 'ఫోమా గ్రిగొర్యేవిచ్! ఫోమా గ్రి గొర్యేవిచ్! ఏదైనా భయంకరమైన కథ చెప్పు!'' అని పీడిస్తారు. కథ చెప్పేవరకు వదలిపెట్టరు. కథ చెప్పడానికేం అభ్యంతరం లేదుగాని, కథ విని పండుకున్నతరవాత చూడాలి! జ్వరం వచ్చినపుడులాగా తలగడాకింద వణికిపోతూ ముసుగుపెట్టుకుని పండుకోవాలని తహతహలాడిపోతారు. ఏ ఎలికయినా ఏ కుండను గోకినా, లేదూ కాలికి యినపకోలతగిలినా, ఇంకే ముంది భయంతో మతి పోతుంది. రాత్రి ఇంత అయిందే అని ఊరుకుంటారా? మళ్ళీ మర్నాడు ఏమీ జరగనట్లు కథ చెప్పమంటూ వేధించుకుతింటారు. సరేగాని మీకే కథ చెప్పాలి? ఈ క్షణంలో నా కేవీ తట్టడంలేదు. ఆఁ – అదీ! మంత్రగత్తెలు మా తాతగారిని వంచించడం చెపుతావినండి. కాకపోతే ముందే చెపుతున్నా, మధ్యలోమాత్రం అడ్డుతగలకండి. తగిలారా రంజు చెడిపోతుంది. ఆ పయిన వినాలని బుద్ధిపుట్టదు.

మా తాత, ఆయన రోజుల్లో, కోసక్లలోకెల్ల ప్రముఖుడు. చదవను వ్రాయను నేర్చినవాడు. పొడి అక్షరాలు గుర్తులు వాడడం కూడా తెలుసు. జయంతిరోజున 'అపొస్తులుల కార్యములు' పఠించే స్వరం వింటే నేటి ఫాదరీల కొడుకులు కూడా తలవంచుకోవాల్సిందే! ఆ రోజుల్లో బాటురిన్ అంతటా చదవను వ్రాయను వచ్చినవాళ్ళని ఒకచోటికి చేర్చితే మూరెడునేల చాలు. వేళ్ళమీద లెక్కపెట్టచ్చు. అందుచేత

ఎవరు తారసిల్లినా మా తాతగారికి వంగి వంగి మరీ నమస్కరించేవారు.

ఒకరోజున మన సేనానికి జారినాకి జాబు వ్రాసి పంపాలని బుద్ధిపుట్టింది. ఆ రోజుల్లో పటాలం గుమాస్తా. అతనిపేరు సరిగా జ్ఞాపకంలేదు-ఏదో విచిత్రమయిన పేరు, మా తాత గారిని పిలిపించి జారినాకి ఉత్తరం నువ్వు తీసుకువెళ్ళాలని సేనాని ఆజ్ఞాపించాడని చెప్పాడు. కాలహరణం చేయడం మా తాతకు ఇష్టంలేదు. ఉత్తరం టోపీలో గుచ్చి గుర్రాన్ని బయటకితీసి భార్యను పాలుతాగే పందిపిల్లలు రెంటినీ-కొడుకుల్ని అలా ముద్దుగా పిలిచేవాడు-ముద్దు పెట్టుకుని బయలుదేరాడు. ఆ ఇద్దరిలో మా నాన్న ఒకడు. ఇక ఆ రోజున వీధిలో పదిపదిహేనుమంది పిల్లలు అల్లరి ఆటలు ఆడుతూంటే లేచేటంతదుమ్ము లేవగొట్టాడు మా తాత. మార్నాడు ఉదయం నాలుగోసారి కోడి కూయకముందే కొనొటోప్ చేరుకున్నాడు. ఆ రోజున అక్కడ సంత. వీధుల్లోని జనం గుంపులు చూస్తే తలతిరిగిపోతుంది. ఇంకా బాగా తెల్లవారలేదేమో, జనం నేలమీాద పడుకుని నిద్రపోతున్నారు. ఒక ఆవు పక్కన జానువాయి పిట్టంత ఎర్రటిముక్కు వేసుకుని ఒకపోకిరీకుర్రాడు పడుకున్నాడు ఇంకాకొంచెందూరంలో చెకుముకిరాళ్ళు, మైలతుత్తంపొట్లాలు, చిన్నచిన్న తుపాకిగుళ్ళు, జంతికలు అమ్మడానికి తెచ్చిన ఒకస్త్రీ కూర్చున్నచోటనేగుర్రుపెట్టి నిద్రపోతోంది. ఒక జిప్సీ బండికింద, క్రిమియానుంచి వచ్చిన ఒక బండివాడు చేపలబండిమీాద పడుకున్నారు. పటకాలు, మేజోళ్ళు అమ్మ

డానికి మాస్కోనుంచివచ్చిన ఒక గడ్డంమనిషి రోడ్డు నడిమధ్యన కాళ్ళుపారజాపుకుని పడుకున్నాడు. క్లుప్తంగా చెప్పాలంటే మామూలుగా సంతకువచ్చినట్లే రకరకాలజనం గుంపులు గుంపులుగా వచ్చారు. మా తాత ఆగి చుట్టూ పరకాయించి చూసాడు. దుకాణాలలోసందడి ప్రారంభమయింది. యూదు వనితలు సీసాలు గలగలలాడిస్తున్నారు. అక్కడక్కడా పొగ ఉంగరాలు ఉంగరాలుగా తిరుగుతోంది. వేడి వేడిపునుకుల వాసన సంతఅంతటా వ్యాపించింది. నిప్పుతాడు, పొగాకు దగ్గరలేదని మా తాతకు జ్ఞాపకంవచ్చి సంతలో పచార్లు చేదామని బయలుదేరాడు. ఇరవయిఅడుగులు వెళ్ళాడోలేదో జపరోజియే కోసక్ ఒకడు కనిపించాడు. మాంచి చురుకయిన వాడని మొహమే చెపుతోంది. నిప్పురంగుఇజారు, ఊదాకోటు, పువ్వుల కాసికోక, పక్కనకత్తి, మడమలదాకా వేళాడే ఇత్తడి గొలుసుతో పైపు-నికారసు జపరోజియే కోసక్. జపరోజియే కోసక్‌లు గొప్పగానాట్యం చేస్తారు. లేచి నిటారుగా నిలబడి, నీటుగా మీసం దువ్వి, ఇనప మడమలు టకీమనిపిస్తారు - ఇక ప్రారంభం! ప్రారంభం! ఆడదాని చేతిలోని వంటె కోలలాగా కాళ్ళు గిర్రున తిరుగుతాయి, చేతివేళ్ళు తంబురా తీగలమీద సుడిగాలిలా ఆడతాయి. నాట్యమో సంగీతమో మొదలు పెడతారు. ప్రేక్షకహృదయాలు ఝల్లుమంటాయి! అవును ఆ కాలం వెళ్ళిపోయింది. ఈ కాలంలో అటువంటి జపరోజియే వారే కరువయినారు!

సరే, ఇద్దరూ కలుసుకున్నారయ్యా మాటమాటకు దారి తీసింది. ఇట్లే స్నేహం కుదిరింది. ఇంకేం ప్రయాణంసంగతే మరిచేపోయాడు మా తాత. ఇద్దరూ ఒకటే బాతాఖానీ! వివాహాంలోలాగా పందేలు వేసుకుని తాగారు. కుండలు పగులుగొట్టి, డబ్బులు విరజిమ్మి విసిగి తిరిపోయిదనుకుంటూ. సంత ఎల్ల కాలమూ ఉండదుగా! అందుకని కొత్తస్నేహితు లిద్దరూ కలిసి ప్రయాణంచేయాలని నిశ్చయించుకున్నారు. ఆరుబయటికి వచ్చేసరికి సాయంకాల మవుతోంది. సూర్యుడు అస్తమించాడు. ఆకాశంలో అక్కడక్కడా ఎర్రటి చారలు ప్రకాశిస్తున్నాయి. శెలవుదినాలలో మన నల్ల కనుబొమల యువతులు ధరించే గళ్ళ లంగాలలాగా వివిధరంగుల భూము లతో ఆ ప్రాంతమంతా ఆనందప్రదంగా ఉంది.

మన జపరోజియే కోసక్ పిచ్చివాడిలాగా ఒకటే వాగుడు మొదలుపెట్టాడు. మా తాత, వారికి తోవలో కలిసిన ఇంకో డంబాలరాయుడు ఆ కోసక్‌కి దెయ్యం పట్టిందని అను మానించారు. పొట్ట చెక్కలయేటంత నవ్వుపుట్టించే కథలు, గాథలు వాడికి ఎలా పట్టుబడ్డాయి? వెళుతూన్నకొద్దీ చీకటి ఎక్కువయింది. దానితోపాటు ముచ్చట్లుకూడా ఎక్కువ అసందర్భంగా తయారయ్యాయి. చివరకు మనకథకుడు మౌనం వహించాడు. చీమ చిటుక్కుంటే అదిరిపోసాగాడు.

"ఆc - నేస్తం!" అన్నారు అతనితో. "కునుకుపాట్లు పడుతున్నావు. యింటికి వెళ్ళి వెచ్చగా స్టౌవ్‌మీద పడుకో వాలని లేదా?"

"మీా దగ్గర దాయడమెందుకు?" అన్నాడు ఆ కోసక్ హాఠాత్తుగా వెనుకకు తిరిగి వారిమీాద నిలకడగా దృష్టినిలిపి. "నా ఆత్మని యెన్నడో దెయ్యానికి అమ్మేసాను. మీాకు తెలుసా?"

"యిదేం కొత్తగా వినడమా? దెయ్యంతో సంబంధం పెట్టుకోందెవరు? అందుకనే సామెతచెప్పినట్టు ఆనందంలో తలమునకలు వేయాలన్నారు."

"ఆఁ - అలాగే చేదునుగాని యివాళరాత్రి నన్ను దెయ్యం యెగరేసుకుపోతుంది! నన్ను విడిచిపెట్టకండి!" అన్నాడు వారిచేతులు పట్టుకుని. "యీా ఒక్కరాత్రి నన్ను కాపాడండి. మీా మేలు యెన్నటికీ మర్చిపోను!"

అంతకష్టంలో ఉన్నవాడికి సహాయం ఎందుకు చేయకూడదూ? ఈ క్రిస్టియను ఆత్మను దెయ్యాన్ని తాకనిస్తే తల గొరిగించుకుని సున్నపుబొట్లు పెట్టించుకుంటానని మా తాత అప్పటికప్పుడు ప్రమాణంచేసాడు. ఆకాశం నల్ల చేనేతవస్త్రం పరిచినట్టు, మేఘాలతో నిండకపోతే, గొర్రెచర్మపుకోటు లోపలలా చీకట్లుకమ్మకపోతే మన కోసక్‌లు ఇంకా ముందుకు సాగిపోయేవారే. దూరాన దీపం మిణుకుమిణుకు మంటూ కనిపించింది. దగ్గరలో కొట్టాంఉందని పసికట్టి, చెవులు నిక్కపొడుచుకుని చీకటిలోకి తేరిపారజూస్తూ దౌడుతీయసాగాయి గుర్రాలు. ఆ దీపం వారిని కలుసుకోడానికి పరుగెత్తుకుంటూ వస్తున్నట్లనిపించింది. బారసాల వేడుకలనుంచి ఇంటికి తిరిగివెళ్ళే రైతుపనితలాగా ఒకవేపుకు ఒరిగిన సారాదుకాణం వారిముందు

కనిపించింది. ఆ రోజులలో సారాదుకాణాలు ఈ రోజులలో సారాదుకాణాలలాగా ఉండేవికావు. ఇటు అటు తిరగడానికి గాని, హోపాక్ నృత్యంచేయడానికిగాని స్థలం ఉండేదికాదు. సారా మత్తు నెత్తికెక్కి కాళ్ళు తడబడుతున్నా పడుకోవడానికి జాగా దొరికేది కాదు. ఆవరణఅంతా శకటాలతో నిండి పోయేది. పందిళ్ళకింద, కుడితితొట్లలో, ధాన్యపుకొట్లలో కాళ్ళుముడుచుకు, పారజాపుకుని గండుపిల్లులలాగా గుర్రు కొడుతూ జనం నిద్ర పోతున్నారు. సారా దుకాణాదారు మాత్రం బండివాళ్ళు తాగిన మద్యం కొలవడానికి కర్రబద్దకు గాట్లు పెడుతున్నాడు.

మా తాత ముగ్గురికీ కలిపి ముంతలో మూడోవంతు సారా తెమ్మని తాగి ధాన్యపుకొట్టుకు వెళ్ళాడు. ముగ్గురూ పక్కపక్కన్నే పడుకున్నారు. మా తాత అటూఇటూ మెసిలేలోపునే స్నేహితు లిద్దరికీ బండనిద్ర పట్టింది. దోవలో కలిసిన కోసక్‌ను లేపి తను సహచరుడికి ఇచ్చిన వాగ్దానం మా తాత జ్ఞాపకం చేసాడు. ఆ మూడో కోసక్ లేచి కళ్ళు నులుముకుని తిరిగి పడుకుని నిద్రపోయాడు. ఇక చేసేదేముంది? తాతయ్య ఒక్కడే కనిపెట్టుకు కూచోవాలి. ఏదోవిధంగా నిద్రని దగ్గరకు చేరనీయకుండా ఉండడానికి శకటాలన్నిటినీ పరీక్షించాడు. గుర్రాలకేసి చూసాడు. పైపు వెలిగించుకుని తిరిగివచ్చి సహచరుల పక్కన కూర్చున్నాడు. ఎక్కడా చడీ చప్పుడూలేదు. ఈగకూడా ఎగరడంలేదు. పక్కనేఉన్న ఒక శకటం వెనకనుంచి ఏదో బూడిదరంగుది కొమ్ములు ఇవతలకు

పెట్టినట్లు అనిపించింది. కళ్ళు మూతలు పడసాగాయి. పిడికిలితో నిమిష నిమిషానికీ కళ్ళు రుద్దుకుంటూ, మిగిలినవోడ్కా తాగుతూ నిద్ర కాయవలసి వచ్చింది. కళ్ళు బాగా తెరుపుడు పడగానే కొమ్ములు కనిపించేవికావు. కాసేపయిన తరవాత ఆ పిశాచం శకటంకింద కనిపించింది. తాత కళ్ళు బాగా తెరచాడు. కాని వెధవ నిద్రమత్తు! అంతా మసక మసకగా ఉంది. చేతులు మొద్దుబారాయి. తల ఒకవేపుకు ఒరిగింది. పందుకొని ఒళ్ళుతెలియని నిద్రపోయాడు. చూడడానికి చచ్చినవాడిలా ఉన్నాడు. ఇలా గంటలకుగంటలునిద్రపోయాడు. సూర్యకిరణాలు బోడినెత్తిమీద పడి చుర్రుమంటేనే కాని మెలుకువరాలేదు రెండుసార్లుకాళ్ళుచేతులూ జాడించివీపు గోక్కున్న తరువాత సాయంత్రం అక్కడఉన్నన్ని శకటాలు ఇప్పుడు లేవని గమనించాడు. బళ్ళవాళ్ళు తెల్లవారకముందే వెళ్ళిపోయిఉంటారు. సహచరులకోసం చూశాడు. కోసక్ ఇంకా నిద్రపోతునేఉ న్నాడు. కాని జవరోజియే కోసక్ మాత్రం కనిపించలేదు. అతని ఆచూకీ ఎవరూ చెప్పలేక పోయారు.పైచొక్కామాత్రం ఆక్కడేపడిఉంది. తాతయ్యకి భయం వేసింది. ఏం అనుకోవాలో తోచలేదు. గుర్రాలను చూదామని వెళ్ళాడు. అతని గుర్రపుజాడగాని, ఆ జవరోజియే కోసక్ గుర్రంజాడగానిలేదు. దీనంతటికీ అర్థమేమిటి? పోనీ జవరోజియే వాడినిదెయ్యం ఎత్తుకుపోయిందనుకుందాం. మరి గుర్రాలను ఎవరు తీసుకుపోయిఉంటారు? దెయ్యంకాలినడకను వచ్చిఉంటుంది. నరకం చాలాదూరం. అందుకని గుర్రంమీద

ఉడాయించి ఉంటుంది, అని బాగా ఆలోచించి మరీ నిర్ధారణకు వచ్చాడు. ఆడినమాట తప్పామేఅని మనిషి తలకిందులయి పోయాడు.

"సరే, యిక చేసేదేంవుంది? నడిచే వెళతాను. సంత నుంచి యెవడయినా గుర్రాలవర్తకుడు దోవలో తారసిల్లక పోతాడూ, వాడిదగ్గర యింకో గుర్రాన్ని కొంటాను" అనుకున్నాడు. టోపీ తీసుకుందామని చేయిజాపాడు. లేదు. ఆకిందటి రోజున కాసేపు తానూ జసరోజియే కోసక్ ఒకరి టోపీలు ఒకరు పెట్టుకోవడం జ్ఞాపకంవచ్చి చేతులు నలుపుకున్నాడు. దెయ్యం కాకపోతే మరెవరు టోపీ ఎత్తుకుపోతారు? బలే! జారినాకు ఉత్తరం బలేబాగా అందించాడు! ఇక ఆ దెయ్యాన్ని ఒకటే తిట్టిపోయడం ప్రారంభించాడు. ఆ తిట్లేగనక దెయ్యం వింటే తల నేలకేసి కొట్టుకొనును! అయితే తిట్లవల్ల వచ్చే లాభమేమిటి? నెతి ఎంత కొట్టుకున్నా మా తాతయ్యకి ఉపాయమేమీ తోచలేదు. ఇక ఏంచేయాలి? ఇతర్ల సలహా తీసుకుందామని ఆ సమయంలో సారాదుకాణంలో ఉన్న బళ్ళవాళ్ళని, బాటసార్లనీ పోగుచేసి ఏంజరిగిందీ, తనకు వచ్చి పడ్డ కష్టం అంతా చెప్పాడు. బళ్ళవాళ్ళు చాలాసేపు ఆలోచించారు. కొరడాలమీద గడ్డాలు పెట్టుకుని తలలు ఊపుతూ ఇంతవరకు క్రైస్తవ ప్రపంచంలో సేనాని ఉత్తరం దెయ్యం ఎత్తుకుపోయిన విచిత్రగాథ ఎన్నడూ వినలేదని చెప్పారు. దెయ్యంగాని, మాస్కోవాడుగాని ఎవరయినా దొంగిలిస్తే ఇక నీళ్ళు వదులుకోవల్సిందేనని తక్కినవారు చెప్పారు. ఒక్క

దుకాణాదారుమాత్రం నోరు మెదపకుండా ఒకమూల కూర్చు న్నాడు. తాతయ్య అతనిదగ్గరకు వెళ్ళాడు. మనిషి. నోరు మెదపకపోతే అతను తెలివితక్కువవాడు కాదని నిర్ధారణ చేసుకోవచ్చు. కాని ఆ దుకాణాదారు మితంగా మాట్లాడే మనిషి. మా తాతేగనక జేబులోనుంచి అయిదు బంగారు నాణేలు తీసి గలగల లాడించకపోతే ఎంతసేపు నిలబడ్డా ప్రయోజనం ఉండేదికాదు.

"వుత్తరం తిరిగీసంపాదించే వుపాయం చెపుతా, విను!" అన్నాడు దుకాణాదారు పక్కకు తీసుకువెళ్ళి. ఈ మాటలకు మా తాతమనసులోనుంచి బరువు తీసివేసినట్లయింది. "నీ కళ్లు చూస్తే నువ్వు తెలివితక్కువవాడివేంకాదు, కోసకొవి అని తోస్తోంది. బాగావిను. దుకాణందగ్గర సరాసరి అడవిలోకివెళ్లే మలుపు కుడివేపున కనిపిస్తుంది. చీకటిపడీపడగానే బయలుదేర డానికి సిద్ధంకావాలి. ఆ అడవిలో జిప్సీలు నివసిస్తున్నారు. యినుము సాగగొట్టడానికి రాత్రిళ్ళు గుహలలోనుంచి బయ టకు వస్తూంటారు. వారు తయారుచేసే యినుపకోలలమీదనే మంత్రగత్తెలు తిరుగుతూంటారు. మీ అసలువృత్తి యేమిటని వాళ్ళని అడగద్దు. అడవిలో యినుంమీద సమ్మెటలలో కొడు తున్నశబ్దం వినిపించిందా. ఆ చాయలకువెళ్ళద్దు. యెదురుగా కాలిపోయిన చెట్టుదగ్గర కాలిబాట కనిపిస్తుంది. ఆ కాలిబాట వెంటనే ఆగకుండా వెళ్ళు. ముళ్ళు గీసుకుపోవచ్చు. దట్ట మయిన పొదలు దోవకు అడ్డం రావచ్చు. ఆగకుండా చిన్న కాలువతగిలేవరకు నడిచివెళ్లు. అక్కడ నీకుకావలసినవాళ్ళు

కనిపిస్తారు. జేబునింపుకోవడంమాత్రం మర్చిపోవద్దు. మనుష్యులకేకాదు, దెయ్యాలకుకూడా డబ్బంటే మమకారమే. తెలిసిందా?" ఇలాచెప్పి ఆ దుకాణాదారు మూలకువెళ్ళి కూర్చుని మరిమాట్లాడ లేదు.

మా తాత గుండెనిబ్బరం తక్కువమనిషేం కాదు. తోడేలు కనిపిస్తే తోకపట్టుకుని లాగేరకం. కోసక్ లమీద పిడికిలి ప్రయోగిస్తే బేరిపళ్ళు రాలినట్టు కిందకు రాలేవాళ్ళు. అయినప్పటికీ ఆ చీకటిరాత్రి అడవిలోకి అడుగు పెట్టగానే గుండె దడదడా కొట్టుకుంది. మచ్చుకయినా నక్షత్రం కాన రావడం లేదు. చీకటిమయం! నేలభోషాణంల్లోలాగా ఎక్కడా చడీచప్పుడూ లేదు. దూరాన ఎక్కడో చెట్లకొమ్మలమీద చలిగాలి హోరుమంటోంది. తప్పతాగిన కోసక్ లలాగా చెట్లు ఊరికే ఊగిపోతున్నాయి. ఆకులు తాగుబోతు పాట గొణుక్కుంటున్నాయి. ఆ తరవాత విపరీతమయిన చలి వేసింది. గొర్రెచర్మం తెచ్చుకుంటే బాగుండిపోయేదనిపించింది. ఇంతలో హఠాత్తుగా వంద సమ్మెటలతో కొట్టుతున్నట్టు పెద్ద చప్పుడయింది. చెవులు గింగుర్మన్నాయి. వేసవి మెరుపులాగా అడివిఅంతా ధగధగలాడిపోయింది. పొదలమధ్యగా తాతయ్యకు చిన్నకాలిబాట పొడగట్టింది. అక్కడే కాలిపోయినచెట్లు, ముళ్ళపొదలు! అంతా అతను చెప్పినట్టుగానే ఉంది. దుగాణాదారు మోసంచేయలేదు. అయినా గుచ్చుకునే పొదలమధ్యగా దోవచేసుకుంటూ వెళ్ళడం ఏమంత సుఖంగాలేదు. జీవితంలో ఎన్నడూ అంతగా గీసుకుపోయేం

ముళ్ళు, రెమ్మలు ఆయన చూడలేదు. అడుగడుగుకూ ఏడుపు వచ్చేటంత పని అయింది. మెల్లగా నడుచుకుంటూ ఒక ఖాళీ స్థలంలో ప్రవేశించాడు. కనుచూపు మేరవరకూ చెట్లు ఎడం ఎడంగా ఉన్నాయి. ముందుకు వెళ్ళినకొద్దీ పోలండు బయట కూడా ఎన్నడూ కనిపించని పెద్దపెద్ద చెట్లు కనుపించాయి. ఒహో! ఆ చెట్లమధ్యగా పదునుపెట్టిన ఉక్కులాగా చిన్న కాలువ ఒకటి తళుక్కుతళుక్కు మంటోంది. చుట్టూచూస్తూ చాలాసేపు ఒడ్డుమీద తాతయ్య నిలబడ్డాడు. అవతల ఒడ్డున చిన్నదీపం మినుకుమినుకు మంది. నిమిషనిమిషానికీ ఆరి పోవ బోతూ, కోసక్ చేతుల్లోపడ్డ పోలండు వాడిలాగా వణికిపోతూ నీళ్ళల్లో ప్రతిబింబిస్తోంది. అదిగో, చిన్నవంతెన!

"దయ్యాలబళ్ళు తప్పితే; యెవీయీవంతెన దాటలేవు" అనుకున్నాడు తాతయ్య.

అయినప్పటికీ తాతయ్య ధైర్యంగా ముందడుగువేసాడు. పొడుండబ్బా తీసి చిటికెడు పొడుం పైకితీయడానికి పట్టేకాలం కంటె తక్కువకాలంలోనే అవతలి ఒడ్డుకు చేరుకున్నాడు. అక్కడ నెగడుముందు జనం కూర్చుని ఉన్నారు. ఇంకొకప్పు డయితే వారి పరిచయంకాకుండా తప్పించుకోడానికి ఏమయినా ఇచ్చేవాడే. వాళ్ళ పందిమొహాలు అంతవికృతంగా ఉన్నాయి. కాని ఇప్పుడు వాళ్ళతో స్నేహంచేయక తప్పదు. అందుకని మా తాతగారు వంగివంగి నమస్కరించి, "భగవంతుడు మిమ్ము రక్షించుగాక మహాజనులారా!" అన్నాడు.

కాని ఒక్కరూ తల వంకించలేదు. మాట్లాడకుండా కూర్చుని ఏదో మంటలలో వేస్తున్నారు. జాగా కనిపించేసరికి తాతయ్య వెళ్ళికూర్చున్నాడు. ఆపంది మొహాలు ఏమీ అనిలేదు. అలాగే మౌనంగా చాలాసేపు అందరూ కూర్చున్నారు. తాతయ్యకి విసిగెత్తింది. జేబులో చేయిపెట్టి తడిమి పైపైపైకి తీసి చుట్టూచూసాడు. ఒకడూ అతని కేసి చూడడంలేదు.

"సరే. తమరు పూజ్యులు, దయవుంచి; నిజానికి చెప్పాలంటే –" తాతయ్య కొంతవరకు ప్రపంచం చూసినవాడాయె, వడుపుగా మాట్లాడడం తెలుసు. జారుముందు నిలబడ్డా మాటలకు తడుముకో నవసరంలేదు. "నిజానికి చెప్పాలంటే నా తాహతు మరిచిపోయీ కాదు. –నా దగ్గరవుందిగాని వెలిగించడానికి యేమీలేదు."

ఈ మాటలకుకూడా ఎవరూ మారుపలకలేదు. ఆపంది మొహాలలో ఒకడు సూటిగా తాతయ్య మొహంమీదికి కాలే కాలే కొరివి తోసాడు. తాతయ్యగనక సమయానికి కొద్దిగా పక్కకు తప్పుకోపోయినట్లయితే శాశ్వతంగా ఒక కన్ను పోయేదే! కాలం వృథాగాగడిచిపోతోందని, ఆ పవిత్రజాతి విన్నావినకపోయినా తనగాథ వారికి చెప్పాలని నిశ్చయించుకున్నాడు. ఇక వాళ్ళు చెవులు ఓరచేసుకుని, పంజాలు జాచారు. వాళ్ళకేంకావాలో తాతయ్య ఊహించాడు. దగ్గిర ఉన్న డబ్బంతా తీసి కుక్కలముందు వేసినట్టు వాళ్ళముందు పారేసాడు. డబ్బుపారేయగానే తాతయ్యముందు గందరగోళం

పుట్టింది. భూమి వణికింది. హఠాత్తుగా - ఎలాజరిగిందో చెప్ప లేడుగాని - నరకలోకంలో ఉన్నాడు.

"ఆరి భగవంతుడా!" అని తాతయ్య మూలిగాడు, పరకాయించి చూసి. రాక్షసాకారాలు! ఒకరిమొహంకంటే ఒకరిమొహం ఎక్కువవికారంగా ఉంది. కిస్మస్‌పండుగరోజు లలో పడే మంచుపెచ్చులంతమంది మంత్రగత్తెలు! సంతకు వెళ్ళే స్త్రీలలాగా దుస్తులుధరించి, మొహాలకు రంగువేసు కున్నారు. అంతాతాగినవాళ్ళలాగా దెయ్యపుహోపాక్ లాంటి నాట్యంచేస్తున్నారు. ఎంతదుమ్మురేచిందని! ఈ సైతానుసంతతి వాళ్ళు అంత ఎత్తున ఎగరడంచూస్తే ఏ క్రైస్తవుడయినాసరే వణికిపోతాడు. భయంవేసినా, కుక్కమొహాలూ! ఊచకాళ్ళూ వేసుకుని దెయ్యాలు తోకలుఆడిస్తూ, మనకుర్రాళ్ళు అంద మైన బాలికలచూట్టూ పాడుతూఆడుతూ తిరిగినట్లు మంత్రగత్తెలచుట్టూ తిరగడంచూసేసరికి తాతయ్యకు నవ్వు ఆగలేదు. తాతయ్యను చూసీచూడగానే ఆయనచుట్టూ గుంపుగాచేరారు. పంది మొహాలు, కుక్కమొహాలు, మేక మొహాలు, గుర్రంమొహాలు - ముద్దెట్టుకోవడానికి ముందుకు వచ్చాయి. తాతయ్యకి అసహ్యం వేసి ఉమ్మేసాడు. చివరికి ఎలాగయితేనేం తాతయ్యని పట్టుకుని కొనొటాప్‌నుంచి బటూ రిన్ వెళ్ళే రోడ్డంత పొడుగుబల్లముందు కూర్చోబెట్టారు.

"సరే, యిదేమంత అధ్వాన్నంగాలేదు." అనుకున్నాడు తాతయ్య బల్లమీద పందిమాంసం, మాంసంకూరలు, కాబే

జీతో ఉడికించిన ఉల్లిపాయలు, ఇంకా రకరకాల వంటకాలు చూసి. "యీ మూకకి వ్రపవాసాల పట్టింపే లేనట్టుందే!"

తినే పదార్థాలు మంచి మంచివి దొరికితే మా తాతయ్య అవకాశం జారవిడిచేవాడుకాదు. కమ్మగా తినేవాడు. అందుకని మాటలతో కాలం వృధాపుచ్చకుండా, పందిమాంసం ముక్కలు, పొగచూరినతోడ ఉన్న గిన్నె ముందుకు తోసుకుని, రైతు గడ్డివిసిరివేసే పంటికర్రంత ముండ్లగరిటెతో పెద్దముక్క మీద పెట్టి, అరే! ఆశ్చర్యం! పక్కవాడి నోట్లువేసాడు! పక్కవాడి దానిని నమలుతున్న చప్పుడు, లొట్టలు వేస్తున్న చప్పుడు అందరికీ వినిపించింది. తాతయ్య కోపగించుకోకుండా ఇంకో ముక్క తీసుకుని పెదవులదగ్గర పెట్టుకున్నాడు. కాని అదీ గొంతులోకి పోలేదు. మళ్ళీ ఇంకోమాటు యత్నించాడు. మళ్ళీ అంతే జరిగింది. తాతయ్యకి ఒళ్లుతెలియని కోపంవచ్చింది. భయం గియం మరిచేబోయాడు. ఎవరిచేతుల్లో చిక్కకుందీ మరిచేబోయాడు. మంత్రగత్తెల దగ్గిరకు పరుగెత్తాడు.

"నన్ను నవ్వులపాలుచేయాలని చూస్తున్నారా, యీ క్షణంలో నా టోపీ నా కిచ్చేయకపోతే, మీ పందిముట్టెలు వెనక్కి మెలితిప్పేస్తా! జాగ్రత్త!"

మాట ముగిసిందో లేదో ఆ రాక్షసాకారాలు పళ్ళు ఇకిలించి పెద్దపెట్టున నవ్వసాగాయి. మా తాతయ్య గుండె ఆగిపోయేటంత పనయింది.

"బలే!" అని అరిచింది ఒక మంత్రగత్తె. వాళ్ళందరిలోకీ ఎక్కువ అందంగా ఉండడాన్నిబట్టి ఆమె వారందరికీ నాయకు

రాలని మా తాతయ్య భావించాడు. "దొంగాటలో మూడు ఆటలు మామీద గెలిస్తే నీ టోపీ నీ కిచ్చేస్తాం."

ఇప్పుడు తాతయ్య ఏంచేయాలి? తాను కోసక్! ఆడ ముండలతో కూర్చుని పేకాడడమూ! కొంతసేపు ససేమిరా ఆడనని భీష్మించాడు. కాని చివరికి పేకాటకు కూర్చున్నాడు. పేకతీసుకువచ్చారు. ఘాదరీల కూతుళ్ళు తమ భర్తలు ఎలా ఉంటారో తెలుసుకోవడానికి ఉపయోగించే పేకలాగా నున్నగా ఉంది, ఆపేక!

"విను" అని అరిచింది ఆ మంత్రగత్తె. "నువు ఆట గెలిస్తే నీ టోపీ నీ కిచ్చేస్తాం. మూడు ఆటల్లోనూ నువు దొంగవయితే యికనువు టోపీని చూడవు. యెన్నటికీ యీ ప్రపంచాన్నీ చూడవు?.

సరే, కానీ, ముసలిముండ! యేమవుతుందో అవుతుంది, కానీ!"

"సరే, పేకలు పంచారు. తాతయ్య ముక్కలు తీసుకున్నాడు. వట్టి దిక్కుమాలిన ముక్కలు! వక్క తురుఫూ లేదు. ఎగతాళిచేస్తున్నట్లుంది. అసహ్యంవేసి చూపుతిప్పేసుకున్నాడు. తక్కిన రంగులన్నిటిలోకీ పెద్దది పది. జంట ఒకటీ రాలేదు. ఇక మంత్రగత్తె తడవకు అయిదు ఇవ్వసాగింది. ఖర్మం దొంగఅవడం తప్పేట్టులేదు. తాతయ్య దొంగకాగానే ఆ రాక్షసాకారాలు నలువేపులనుంచీ "దొంగ! దొంగ! దొంగ!" అని సకిలించసాగాయి, మొరగసాగాయి, గుర్రుమనసాగాయి.

"గొంతు పగిలిపోయేట్టు అరవండి, దెయ్యపుముండ ల్లారా!" అని అరిచాడు తాతయ్య, చెవులలో వేళ్ళు పెట్టు కుంటూ.

"సరే" అనుకున్నాడు. "మంత్రగత్తె న్యాయంగా ఆడలేదు. నేనే స్వయంగా పేక పంచుతాను." ఇలా అనుకుని పేక పంచాడు. తురుపు తిరగవేసి, తనముక్కలు చూసాడు. బలేభేషుగ్గా ఉన్నాయి. తురుపులు పడ్డాయి. మొట్టమొదట్లో సవ్యంగా నడిచేదికాదుగాని, మంత్రగత్తె అయిదు ముక్కలు వేసింది. అందులో రాజులు ఉన్నాయి.

తాతయ్య చేతిలో తురుపుల్ను తప ఇంకేమీ లేవు. మనోవేగంతో ఆ రాజుల్ని వాటితో కోసేసాడు.

"ఊఁ-నువు కోసక్ వేనా? దేంతో కోసావు?"

"దేంతోనా? తురుపుతో!"

"బహుశా నువు వాటిని తురుపులు అనుకున్నావు. మేంమాత్రం తురుపులు అనుకోవడంలేదు!"

అరె! ఆశ్చర్యం! ముక్కలు తురుపులుకావు! ఇదే మిటి? రెండోతడవ కూడా తాతయ్య దొంగ అయాడు. దెయ్యాలు తిరిగి గొంతుకులు చినిగేటట్టు అరిచాయి.

తాతయ్యకి ఒళ్ళు తెలీలేదు. ఆఖరిసారిగా పేకపంచాడు. మళ్ళీమంచి ముక్కలే పడ్డాయి. మంత్రగత్తె మళ్ళీ అయిదు వేసింది. తాతయ్య వాటినికోసి, పేకనుంచి చేతినిండా తురుపులు తీసుకున్నాడు.

"తురుఫు!" అని కేకపెట్టాడు బల్లమీద ఒకముక్క విసిరికొట్టి. ఆ ముక్క నలిగిపోయింది.

మాట్లాడకుండా ఆ మంత్రగత్తె ఇంకోరంగు ఎనిమిది దానిమీద వేసింది.

"నా తురుఫుమీద దేనితో కొడతావ్! ముసలి దెయ్యమా?"

మంత్రగత్తె తనముక్క పైకితీసింది. దాని అడుగున ఇంకోరంగు ఆకు ఉంది.

"యేం మోసం! యేంమోసం!" అన్నాడు తాతయ్య. కోపంహెచ్చిపిడికిలితో బలంకొద్దీబల్లమీద కొట్టాడు. అదృష్ట వశాత్తూ ఈ తడవ మంత్రగత్తెకు మంచిముక్కలు పడలేదు. తాతయ్యకి జంటలు పడ్డాయి. పేకలోకి ముక్కలు తీసుకో సాగాడు. కాని ఒక్కముక్కా మంచిదిరాలేదు. ఏవో సన్నాసి ముక్కలు వచ్చేసరికి తాతయ్య ముక్కలు పారేసాడు. ఇక ముక్కలు లేవు. అందుకని ఎదయితేనేమని ఆరువేసాడు. మంత్రగత్తె అదే తీసుకోవాలి, కోయడానికి వీల్లేదు. "బలే! బలే! యేవిటిది? యేదో మోసంవుంది. ఆపట్న తాతయ్య నెప్పుగా బల్లకింద పేకముక్కలమీద శిలువగుర్తు వేశాడు. అరే! ఆశ్చర్యం! తాతయ్య చేతిలో ఆసు, రాజు జాకీ, అంతకు ముందు వేసినముక్క ఆసుకాదు రాణీ!

"అరే! యెంత తెలివితక్కువ! తురుఫు రాలా! అహా! తీసుకున్నావా? ఆసుకూడా కావాలా! ఆసు! జాకీ!"

నరకలోకంలో గందరగోళం బయలుదేరింది. మంత్ర గత్తె కాళ్ళుచేతులు కొట్టుకోసాగింది. హఠాత్తుగా టోపీ ఎగిరి వచ్చి తాతాయ్య మొహంమీద పడింది.

"ఊహూ!- యింతటితో యేవయిందీ." అని కేకపెట్టాడు తాతాయ్య ధైర్యం తెచ్చుకుని నెత్తిమీద టోపీపెట్టుకుంటూ. "ఈ క్షణంలో గనక నా గుర్రం నా ముందువచ్చి నిలబడక పోతే మీ అందరిమీదా శిలువగుర్తు వేస్తాను. జాగ్రత్త!" బెది రించినట్లుగా శిలువగుర్తు వేయటానికి చేయి పైకి ఎత్తేసరికి అయనముందు ఆయన గుర్రం బొమికలు గలగల మన్నాయి.

"యిదిగో నీ గుర్రం!"

బొమికలు కనుపించేసరికి పాపం! చంటిబిడ్డలాగాఏడవడం మొదలపెట్టాడు. సహచర్యం అలాంటిది!

"యిక్కడనించి వెళ్ళపోవడానికి యేదో ఒక గుర్రాన్ని యివ్వండి!" ఒకదెయ్యం కోరడా ఝుళిపించింది. తాతయ్య కిందుగా గుర్రం మంటలాగా పైకిలేచింది. తాతయ్య పక్షిలాగా పైకి యెగిరిపోయాడు.

ఎన్ని కేకలువేసినా, కళ్ళెంపట్టుకుని ఎంతలాగినా లక్ష్య పెట్టకుండా గోతులమీదుగా బురదనేలమీదుగా గుర్రందౌడు తీస్తుంటే తాతయ్యకు భయం పట్టుకుంది. ఆయన దాటిన స్థలాలు మహా భయంకరములయినవి. తలుచుకుంటే వణుకు పుడుతుంది. ఒకసారి కిందకు చూసాడు. ఎన్నడూ వేయనంత

భయం వేసింది. అగాధం! భయంకరమయిన కొండఅంచు! కాని ఆ సైతానుగుర్రానికి ఇదో లెక్కా జమా! దానిమీదుగా దూకేసింది. తాతయ్య ఆపాలని చూసాడుకాని గుర్రం ఆగ లేదు. చెట్ల బోదెలమీదుగా, మిట్టలమీదుగా ఎగిరీ ఎగిరీ సరాసరి వెళ్ళి ఒక బొందలో పడ్డాడు. ఆ దెబ్బకి ప్రాణం ఎగిరి పోయినట్టయింది. ఏమయినా అప్పుడు ఏం జరిగిందీ తాత య్యకి ఏ మాత్రం జ్ఞాపకం లేదు. కాస్త తేరుకుని చుట్టూ చూసేసరికి భళ్ళున తెల్లవారింది. అన్నీ పరిచయమయిన మొహాలే! తన గుడిసె పైకప్పుమీదనే పడిఉన్నాడు.

కిందకు దిగి తాతయ్య శిలువగుర్తు వేశాడు. అబ్బ! దెయ్యం ఎంతపనిచేసింది! దాన్ని తగలేయ! ఒకొక్కప్పుడు మనిషికి ఎటువంటి అద్భుతాలు తటస్థిస్తాయి. చేతులు చూసు కున్నాడు. నెత్తురుతో తడిసి ముద్దయిఉన్నాయి. మొహం కూడా అలాగేఉంది. పిల్లలు హడలిపోకుండా శుభ్రంగా కడు క్కొని నెమ్మదిగా గుడిసెలోకివెళ్ళాడు. వెళ్ళగానే ఏం కని పించిం దనుకున్నారు? పిల్లలు వెనక్కి వెనక్కి వెళుతూ భయంతో తల్లినిచూపించి, “చూడు! చూడు! అమ్మ పిచ్చి దానిలా యెగిరిపడుతోంది!” అన్నారు. నిజం! ఆయనభార్య దువ్వెన ముందువేసుకుని, వంకీకోల చేత్తోపట్టుకుకూర్చుని నిద్రపోతోంది. నిద్రలో బల్లమీద ఎగిరెగిరి పడుతోంది. తాతయ్య ఆమెను చేయిమెల్లగాపట్టుకుని మేల్కొల్పాడు. “బాపున్నావా?” ఆమె చాలాసేపు ఆయనకేసి తేరిపారజూసి, చివరకు ఎలాగయితేనేం గుర్తుపట్టి, పారతో కుండలు తొట్టెలు

ఎత్తి కుడేస్తూ స్టోవ్ గుడిసెచుట్టూ తిరుగుతున్నట్లు కలగన్నా నని చెప్పింది.

"బాగానేవుంది" అన్నాడు తాతయ్య. "నిద్రలోనువు కలగన్నావ్, నేను మెలుకవగావుండగానే కలకన్నాను. అంతే తేడా! గుడిసెకి సంప్రోక్షణచేయించాలి. అయితే నాకు వ్యవధిలేదు."

ఇలా చెప్పి తాతయ్య కాసేపు విశ్రాంతి తీసుకుని ఎవరి దగ్గరో గుర్రం తీసుకుని రాత్రీ పగలు అనకుండా ప్రయాణంచేసి జారినా చేతికి ఉత్తరం ఇచ్చాడు. అక్కడ తాతయ్య ఎన్ని అద్భుతాలు చేసాడని! చాలాకాలంవరకూ వాటినిగురించే చెపుతూ వచ్చేవాడు. రాజభవనానికి తీసుకువెళ్ళారు. ఒక గుడిసె చొప్పున పది గుడిసెలు పేర్చుకుంటూ వెళితే ఎంత ఎత్తు ఉంటుందో అంతకన్న ఎక్కువ ఎత్తు ఉంది ఆ రాజభవనం! ఒక గదిలోకి తొంగిచూసాడు. జారినా కనిపించలేదు. ఇంకో గదిలోకి తొంగి చూశాడు. అక్కడా లేదు. ఇలా నాలుగు గదులు చూసినతరువాత అయిదోగదిలో బంగారం కిరీటం పెట్టుకుని, బూడిదరంగు గౌను కొత్తది వేసుకుని, ఎర్రబూట్లు తొడిగి, బంగారంలాంటి బజ్జీలు తింటూ కూర్చుని ఉంది. అయిదు రూబుళ్ళ నోట్లు ఊదా టోపీదు తాతయ్యకు ఇమ్మని ఆజ్ఞాపించింది. ఎలా - నాకు అదేం జ్ఞాపకంలేదు. దయ్యాలతో చనువుగా కాలంగడిపినా ఆ విషయమే తాతయ్య మరిచేపోయాడు. ఎవరన్నా జ్ఞాపకం చేసినా ఆ విషయంతో తనకేమీ సంబంధంలేనట్టు నోరు విప్పేవాడు కాదు. అదంతా

ఎలా జరిగిందో ఆయనగారిచేత చెప్పించడానికి తలప్రాణం తోకకు వచ్చేది. గుడిసెకు సంప్రోక్షణ చేయించడానికి వెను వెంటనే పరుగెత్తనందుకు శిక్షా అన్నట్లుప్రతిసంవత్సరం సరిగా అదే సమయంలో అయన భార్య ఎగిరెగిరి పడుతూండేది. ఎవరూ ఆపలేకపోయేవారు. చిత్రం! ఆమె ఏంపని చేస్తున్నా కాళ్ళు తమ పనేమో చేసేవి. ఎవరో నాట్యంచేయమని ముందుకు తోస్తున్నట్లుండేది!.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B102 |
| పుస్తకం పేరు | సాయంసంధ్యలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 169 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| | S. Lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |